# Own a house or apartment at

Flats are available

# Seashells

## Atop Krupa Hills

## VISAKHAPATNAM

Rs 5 lakhs and above

### And get the best of both worlds

Visakhapatnam- City of Destiny, is one of the fastest growing cities in India today With its Natural Port and increasing Industrial, Business and Trade Activities, it offers unlimited opportunities.

## Seashells

Atop Krupa Hills

Green hills, golden beaches, cool sea breeze, swaying palms Believe it or not, we are not describing a holiday resort but an exclusive residential paradise called Seashells, located atop picturesque hills.

**YES! At SEASHELLS** it will be an investment in Peace & Prosperity.

**Seashells offers you these exceptional facilities:**

★ Adequate guest car park
★ Service shops
★ Meditation Hall
★ Maintenance Workshop
★ Club House
★ Swimming pool
★ Children's Play Corner
★ Tennis Court
★ Jogging Track
★ Landscaped green common plot with sitouts and walk arounds
★ Dish Antenna
★ Fire safety and fire fighting facilities
★ Adequate water supply Tubewell and Municipal Water
★ Gymnasium
★ Creche
★ Standby Generators for lift and other essential services



**2, 3 & 4 BED ROOM APARTMENTS & ROW HOUSES**

For more Information

**Ugesh & Madhav Builders (P) Ltd.**
11-2-1, Waltair Uplands, Visakhapatnam-530003
Phone: 66264 Cable KRUPA
Managing Director **P.V. Ramaniah Raja**

Madras:

**RAJA RAMANIAH & CO**
1-C Century Plaza, 560, Anna Salai P B No 1488, Madras-600018
Phones 457101, 454667, Telex 041-6998 RRCO IN
Fax: (91) 44-458354 Cable· KRUPA

Architects.

**Design Planning Services (P) Ltd**
Ahmedabad-380009

**FINANCE AVAILABLE FROM VYSYA BANK, CANFIN HOMES, LIC, A.B.Homes & H.D.F.C.**

JAGATI Rs. 2-00 July 1992

37th Year of Publication




4 3 2

జులై - 1992

## సాహితీ సుధ

మారుని కూర్మిచుట్టము సమంచిత కేళి రసప్రహదంబు శృం
గార మహీజ నీరదము కంజముఖీ జన దృక్చకోర రా
కార జనీశ మండలము కాంత వచో ణిమ వార్ధి యౌవనం
బారము జెందుచో వికృతి నందని వాడె కృతార్థు డిమ్మహిన్

—భర్తృహరి

గోవధ గావించి గోరోజనమ్ము రో - గార్తుల కొసగ బుణ్యాత్ము డగునె
ఫలశాఖి బడమొత్తి ఫలము లేటించి భూ - సురుల కర్పించిన సుకృతి యగునె
నిండుతటాకంబు ఖండించి చేపల - మత్స్యభుక్కుల దన్ప మాన్యు డగునె
గుడి గొట్టి యిటుకల గూరిచి తులషి తి - న్నలు రచించిన ధర్మనిరతు డగునె
ప్రబల పాతక పూర్ణు డల్పంపు సుకృత - మునను శుద్ధుండు గాకుండు నసుట నిజమ్
మదరిపు విఘాల మునిజన హృదయలోల - వేణుగోపాల భక్తసంత్రాణ శీల

— వేణుగోపాల శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 1000-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు : అ॥ డాలర్లు 75/-

ముఖచిత్రం : విలపిస్తున్న వృక్షరాజం

# నిమ్మతోనలు

విజా సిస్టర్ పెళ్ళికి, నువ్వు పని గట్టుకు వెళ్ళి, అంత శ్రద్ధగా పిలిచినా, ఊళ్ళోవుండి కూడా రాలేదు ఆ లలిత. మళ్ళీ పిలుస్తా వెందుకు మేనర్స్‌లేని ఆ మనిషిని? - అని ప్రశ్నించింది శ్యామల.

'సిస్టర్ పెళ్ళికి ఎగ్గొట్టినా, కనీసం నా మారేజ్ కైనా వస్తుందేమోనని ఆశ' - అంది మాధవి.

'లలిత రాకపోతే నీపెళ్ళి జరగదా? ఈ మహాతల్లి ఎక్కడని మీ ఆయన అడుగుతాడా?'

'అదికాదు, చిట్టీ, - లలిత పెళ్ళికి నేను నూట పదహార్లు చదివించాను. మరి ఆడబ్బు రాబట్టుకోవద్దా?' అని మాధవి చిటెకలో తేల్చేసరికి శ్యామల తెల్లబోయింది.

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

శైలజా సురేషూ ఒక సంవత్సరం బట్టీ గాఢంగా ప్రేమించుకుంటు న్నారు. నీతోడిదే లోకం, నీవు లేక పోతే లోకం చీకటి - అని ఒకరి కొకరు నమ్మకంగా చెప్పుకుంటున్నారు.

గడిచిన సాయింత్రం పార్కులో కలుసుకోలేక పోయినందుకు, బిక్క మొహంతో వచ్చాడు సురేష్.

'శైలూ, నన్ను క్షమించావని చెప్పు'

'దేనికి ?'

'మనం అనుకున్న టైముకి నిన్న నేను పార్కుకి రాలేక పోయినందుకు'

'ఓస్, అంతేకద ! నీకోసం రెండు నిముషాలు చూసి, ఇంతలో మా బావ గోపి కనిపించేసరికి, అతని స్కూటర్ మీద, యిద్దరం ఫస్ట్ షో సినిమా కెళ్ళాం' - అని శైలజ నవ్వుతూ చెప్పిందిగాని అతనికి గొంతుకలో రాయి పడ్డట్టయింది.

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

ఏమండీ డాక్టరుగారూ, నాకు కడుపులో మంటగా ఉంటోందండీ' - అని చెప్పుకున్నాడు వీరభద్రం.

'కొత్త ఆవకాయ సీజను కద - మరికాస్త పట్టించి వుంటారు.'

'అబ్బే, అబ్బే - నేను ఆవకాయ ముట్టను, మామిడి పళ్లు తినను'

'మజ్జిగ దాహం పుచ్చుకోండి - ఆ మంట దానంతటదే చల్లబడుతుంది'.

'డాక్టరుగారూ, ఆ పని చేస్తూనే వున్నాను. కాని, మజ్జిగతో చల్లారే మంట కాదిది.'

'ఎన్నాళ్లుగా ఉంటోంది?' అని డాక్టరుగారి ప్రశ్న.

'మా పక్కవాటా వైద్యనాథం విసి ఆర్ కొన్నప్పట్నుంచీ!'

—కృష్ణశ్రీ
తెనాలి

సుజాతని ఒక పెద్ద కంపెనీవారు ఇంటర్‌వ్యూకి పిలిచారు. సహజంగా తెలివిగల సుజాత ప్రశ్నలన్నిటికీ టక టకా సమాధానాలు చెప్పింది. ఇంట ర్వ్యూ బోర్డులో యిద్దరు మధ్యవయ స్కులు, ఒక పెద్దాయన కూర్చున్నారు. మధ్యవయస్కుల మార్కులు సుజాతకే! కాని, అంతిమ నిర్ణయం పెద్దాయనది.

ఆయన అన్నారు: 'అమ్మా నీవు చెప్పిన సమాధానాలన్నీ నచ్చాయి, వెరీ గుడ్. కాని ఒక్కటే అభ్యంతరం కన పడుతోంది. నీవు పంజాబ్‌లో కొన్నాళ్ల పాటు వున్నానన్నావ్....'

'అవును, సార్, మా ఫాదర్ అక్కడ ఉద్యోగం చేస్తున్నప్పుడు, నేను పంజాబ్ లోగాక కాశ్మీరులో ఉంటానా?'

'ఏమిటి. మీ ఫాదర్ కాశ్మీరులో కూడా ఉద్యోగం చేశారా ?'

'లేదు, సార్, కాశ్మీరులోను అస్సామ్ లోను చేయలేదు. కలకత్తాలో మాత్రం చేశారు. కలకత్తాలో కొన్నాళ్లు వుంటె కమ్యూనిస్ట్ నవుతానా? పంజాబ్‌లో ఉంటే మిలిటెంట్‌నా? హైదరాబాదు పాత బస్తీలో ఉంటే నక్సలైట్‌నా? కన్యాకుమారిలో ఉంటే....'

ఆవేశంగా మాట్లాడుతూ నాలిక కరుచుకున్న సుజాతని చూసి ముగ్గురు సభ్యులూ నవ్వుకు, 'యు ఆర్ సెలెక్టెడ్' అన్నారు.

—కె వెంకటరామ్
పామర్రు

---

తమ కీర్తి ప్రతాపాలు చెప్పుకొనే వారు, ఏనాటికీ గొప్పవారు కానేరరు.

నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణం బలిపెట్టడానికి సిద్ధంగా వుండేవారికి ఓటమి వుండదు.

ప్రజాస్వామ్యం విజయవంతమ యేందుకు, ప్రజాభిప్రాయమూ పౌర బాధ్యత ముఖ్యాంగాలు —వెహ్రూ

---

# పాఠకుల తీర్పు

చందూర్ దంపతులకు; మీ యింట్లో గడిపిన రెండు మూడు గంటలు, నాకు ఒక సంవత్సరానికి సరిపడగల శక్తి, సంతోషం యిచ్చాయి. ఉండండి, అంతా నేనే దాచుకోను. సగం మోహన్‌గారికి పంచుతాను - ప్రామిస్. దూరాన వున్న ఈ స్నేహితుల్ని ఎప్పుడన్నా గుర్తు చేసుకోండి. అఫ్ కోర్స్, మిమ్మల్ని నేను మరిచిపోనివ్వను.

—వాణీ మోహన్
గబరొనె-బొట్స్‌వానా

చందూర్‌గారికి : నమస్తే; 'మూడు నగరాలు' గురించి సమీక్ష వ్యాసం రాసినందుకు మీకూ, క్షీరసాగరమ్ గారికి ఎంతో కృతజ్ఞుణ్ణి. సాహిత్యాభిమానులైన మీ విశిష్ట పాఠకులందరికీ నా పుస్తకం పరిచయమవడం ఎంతో సంతోష దాయకం. మీ దంపతుల వంటి సహృదయులు చదవాలనే కోరికే, ఈ పుస్తకం ప్రచురించడంలో ముఖ్యోద్దేశం.... జానకిరామ్ పోయారని విన్నాను. పండిన వయసులో రాలినా, ప్రాణం చివుక్కుమంది. వారి ఆత్మకథ ఎంత సుందరమైనదో గదా! మీరు ఈసారి ఢిల్లీ వచ్చినప్పుడు మిత్ర బృందంతో ఓ రెండుగంటలైనా గడపమని మా కోరిక. సాహిత్యాభిమానులూ, పిపాసులు వున్నారిక్కడ.

—అమరేంద్ర
ఘజియాబాద్

యన్నార్ చందూర్ గారికి: మద్రాసు కబుర్లేగాక ఎన్నో విజ్ఞాన విశేషాలతో మనసుని రంజింపజేస్తుంది మీ 'డైరీ'. నిర్వాహకులకు, చదివేవారికి సాన్నిహిత్యం చేకూర్చే శీర్షిక 'పాఠకుల తీర్పు'.

—యల్ ఫణీంద్రనాథ్
ధర్మవరం

ప్రియమిత్రులు చందూర్‌గారికి నమస్కారములు.... 'నా రాట్నచక్రం' ఎంతో చక్కని విషయాలు అనుభవ పూర్వకమైన సంగతులు చెబుతూంది. ఆధునిక ఆంధ్ర చిత్రకళకు 'కూల్డ్రే' మహనీయుని సేవ అపూర్వము. తల్లావ్రగడ ప్రకాశరాయుడు గారి జ్ఞాపకాల ద్వారా, మరుగున పడిపోయిన వెలుగులు ఎంతో హృద్యంగా 'జగతి' ద్వారా వెలికి వస్తున్నాయి. నవ్యాంధ్ర చిత్రకళా స్రవంతికి కారకుడైన 'కూల్డ్రే' మహాశయుడు ఆంధ్రులకు చిరస్మరణీయుడు.

—పిలకా లక్ష్మీనరసింమూర్తి
మద్రాసు-94

# వెన్నెల కెరటాలు

## జానపదం

పువ్వు, పుట్టగానే పరిమళించునన్నట్లు బాలికల హృదయములు బాల్యమందలి ఆటపాటలందె పువ్వులవలె విచ్చుకొని పరిమళించును. అనాదిగా బాల బాలికలు పాడుకొను పాటలే అయినప్పటికిని అవి వారి మనసులకు క్రొత్తగనే కనిపించి, రంజింప చేసి ఉత్సాహపూరితులను చేయును. 'కాళ్ళగజ్జ కంకాళమ్మ'తో మొదలయిన ఆట 'ఒప్పులకుప్ప ఒయ్యారి భామ'తో, గిర గిర తిరిగి, సుబ్బిగొబ్బెమ్మా - సుఖము లియ్యవే. తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యవే - చేమంతి పువ్వంటి చెల్లినియ్యవే - మొగిలి పువ్వంటి మొగుడినియ్యవే' అను కిలకిలా రావముల వరకు ప్రాకినా, 'మొగిలి రేకు వంటి మొగుణ్ణియ్యవే' అను వేళ బాలికల డెందములందు క్రొత్త పులకలు మొగ్గలు తొడుగుతాయి. మొగ్గ తొడిగిన భావం బావగారిని చూసి మర్యాద చేయుటకు పురికొల్పి 'బావా బావా పన్నీరు - బావను పట్టుక తన్నేరు - బావడి గుంజకు కట్టేరు - చప్పడి గుద్దురు గుద్దేరు' - అనునంత వరకు వెళ్తుంది.

—బి సత్యవాణి
'స్రవంతి'లో

## సుగంధపు మొక్కలు

భారతదేశంలో దాదాపు 1300 సుగంధపు మొక్కలున్నాయి. నిమ్మగడ్డి, రూసాగడ్డి, కామాక్షి కసువు, వట్టివేరు, పన్నీరు, దవనం, మరువం, నీలగిరి మొదలైన మొక్కల నుంచి తైలం తీసి అత్తర్లు, సెంట్లు పరిమళాలు, శరీర సౌందర్యాన్నిచ్చే కాస్మటిక్స్, సబ్బులు, అగరువత్తులు, పిప్పరమెంట్లు, మత్తునిచ్చే పానీయాలు, తాగే పానీయాలు, తీయని తినుబండారాలు, బేకరీలో కేకులు, బిస్కట్లు, పాన్‌మసాలాలు, జర్దా, వక్కపొడి వగైరాల్లో, శరీర మర్దనానికి వాడే తైలాలు, ఔషధాలు, దోమలు, పురుగులను పారదోలే పదార్థాల తయారీలో వాడుతున్నారు. నిమ్మగడ్డి ఆకులను తేనీరులో వేసి, ఆరోగ్యం కోసం సేవిస్తారు. సుగంధ తైలాలు, పదార్థాలకు డిమాండు నానాటికి అధికమవుతోంది.

—సంపాదకీయం
'అన్నదాత'

# పాతికేళ్ల నాటి పిక్చర్

## యస్వీఆర్ వారి 'చదరంగం'

జీవిత మొక చదరంగం, జీవిత మొక పద్మవ్యూహం, జీవిత మొక కాడెద్దుల బండి - యిలాటివి వినడానికి బాగానే వుంటాయి గాని ఈ నానుడికి అనుగుణంగా కథ అల్లడం చాలా కష్టం. జీవిత మొక చదరంగం అనే మాట అతి ప్రాచీనం - ఇన్‌డోర్ గేమ్స్‌లోని 'ఛెస్' లా. చదరంగం మీద పాట కట్టారు, ఇద్దరు పెద్ద మనుషులు చదరంగం ఆడుతూ ఎత్తు పై ఎత్తులు వేయడంతో కథ ప్రారంభ మవుతుంది. అయితే, కథాగమనంలో గాని కథ తీసుకొనే మలుపుల్లో గాని బుద్ధి జనితమగు ఎత్తుగడలేమీ కనిపించవు. కథానాయిక జమున ; కథానాయిక బావ లేక భర్త హరనాథ్; కథానాయిక పెంపుడు తండ్రి యస్వీ రంగారావు. ఈ మూడూ ప్రధాన పాత్రలు. ఆ పాత్రల చిత్రణ, కళాకారులు ఆ పాత్రలని పోషించిన తీరు ప్రశంసనీయంగా వున్నాయి. విలక్షణమైన వ్యక్తిత్వంతో కూడిన ఈ పాత్రలు ప్రేక్షకుని మెప్పిస్తాయి ; జీవస్పందనతో రసానుభూతి కలిగిస్తాయి ; కళ్లు చెమర్చే సన్నివేశాల గుండా యివి నడుస్తాయి. అయితే, ఈ మూడు పాత్రలలో గల వాస్తవికత మిగతావాటిలో గాని యితివృత్తానికి రూపురేఖలు యివ్వడంలో గాని కనిపించదు... తమ్ముని భార్యాబిడ్డలు డబ్బుకి గడ్డి తినే, కక్కుర్తి మనుష లని తెలిసి కూడా, పెంపుడు కూతురు పై వారు 'దొంగతనం' ఆరోపించినంత మాత్రాన, ముందు వెనకలు ఆలోచించ కుండా నమ్మడం వల్ల పెంపుడు తండ్రి పాత్ర కొంతమేర దెబ్బ తింది. ముసలి తాత వేషంలో యస్వీ రంగారావు, ఎవరి ప్రేమాభిమానాలు ఏ పాటివో అంచనా వేయడంలో నాటకీయత చోటు చేసుకుంది. ఎక్కువ పిల్లలు గలవారికి తన ఆస్తి చెందాలని, సుపరిచిత సూర్యకాంతం విల్లు రాయడం, హాస్య రసపోషణలో ఒక భాగం. అటువంటిదే రమణారెడ్డి సన్యాసుల ముఠాలో చేరడం. కథని రకరకాల పల్టీలు కొట్టించినా, ముఖ్యులు ముగ్గురూ (యస్వీ రంగారావు, జమున, హరనాథ్) సాయం పట్టారు. మాటలూ పాటలూ సందర్భోచితంగా అతికాయి. దర్శకులు : యస్వి రంగారావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జూలై 1967

## మానవ ప్రగతి

3

### వాయిస్ ఆఫ్ అమెరికా

ప్రపంచ ప్రజానీకానికి ఎంతో పరిచితమైన 'వాయిస్ ఆఫ్ అమెరికా' (వి.ఓ.ఏ.) రేడియో ప్రసార వ్యవస్థ ఈ ఏడాదితో యాభయ్యేళ్లు పూర్తి చేసుకున్నది. 'హియర్ స్పీక్స్ ఎ వాయిస్ ఫ్రమ్ అమెరికా' అనే తొలి వాక్యంతో అనౌన్సర్ విలియం హర్లాన్ హేల్ 1942 ఫిబ్రవరి 24న 'వాయిస్ ఆఫ్ అమెరికా' రేడియో ప్రసారాలను ప్రారంభించారు. ఆ వెంటనే ప్రసారమైన పదిహేను నిమిషాల జర్మన్ భాషా కార్యక్రమంలో అనౌన్సర్ హీల్.... ఈ ప్రసారాలు నిష్కపటంగా, విశ్వసనీయంగా వుంటాయని శ్రోతలకు వాగ్దానం చేశారు. 'వార్త మంచిది కావచ్చు, చెడ్డదిగా వుండవచ్చు. మేము మాత్రం మీకు వాస్తవాన్ని చెబుతాం' అని హీల్ స్పష్టీకరించారు. రెండవ ప్రపంచ యుద్ధంలో అమెరికా ప్రవేశించిన 79 రోజుల అనంతరం 'వాయిస్ ఆఫ్ అమెరికా' రేడియో ప్రసారాలు ప్రారంభమయ్యాయి. శ్రోతల విశ్వాశాన్ని, ఆసక్తిని చూరగొనేందుకు 'వాయిస్ ఆఫ్ అమెరికా' తన 1960 నాటి 'ఛార్టర్' ప్రకారం కొన్ని మార్గదర్శక సూత్రాలకు కట్టుబడి పనిచేస్తుంది. ఆ 'ఛార్టర్' లోని అంశాలను బట్టి వి.ఓ.ఏ విశ్వసనీయమైన, వాస్తవికమైన వార్తలను అందిస్తుంది. వార్తలు ఖచ్చితమైనవిగా, విషయ సంబంధమైనవిగా, సమగ్రంగా వుంటాయి. అమెరికన్ సమాజంలోని ఏ ఒక్క భాగానికో కాక మొత్తం అమెరికాకే ప్రాతినిధ్యం వహిస్తుంది. అందువల్ల వి.ఓ.ఏ. అమెరికన్ ఆలోచనలను, సంస్థలను గురించి తులనాత్మకంగా, సమగ్రంగా ప్రపంచానికి చెప్పగలుగుతుంది. అమెరికా ప్రస్తుత విధానాలను గురించి వి.ఓ.ఏ. స్పష్టంగా, సమర్థంగా తెలియజేస్తుంది.... బాధ్యతాయుతమైన చర్చలను, అభిప్రాయాలను అందిస్తుంది. ప్రపంచంలో సంభవించే పరిణామాలను ఎప్పటికప్పుడు రేడియో శ్రోతలకు అందజేసేందుకై ప్రతినిత్యం ప్రపంచ వ్యాప్తంగా వున్న 24 వి.ఓ.ఏ. 'న్యూస్ బ్యూరో'ల నుంచి విలేఖరులు తమ వ్యాఖ్యానా

లను 'సెంట్రల్ న్యూస్ రూమ్'కి టెలిఫోన్ల ద్వారా చేరవేస్తారు. అక్కడ వాటిని 'టేప్' చేసి శ్రోతల కోసం పునఃప్రసారం చేస్తారు. ఇప్పుడు వి.ఓ.ఏ. తన కార్యక్రమాలకు 12 కోట్ల మందికి పైగా శ్రోతలను సంపాదించుకున్నది. రోజుకి సగటున వచ్చే 180 'న్యూస్ ఐటమ్స్' ఆంగ్లం లోను; ఇంకా 46 భాషలలోను ప్రసారం చేస్తుంటుంది..... (అమెరికా సమాచార శాఖ

## మన అక్షరాస్యత

అక్షరాస్యత ప్రగతి 1981-91 సం॥ల మధ్య 8.55 శాతంగా ఉన్నది. ఇది 1971-81 సం॥ల మధ్య 6.97 శాతంగా ఉండేది. ఈ దశాబ్దంలో మహిళల అక్షరాస్యత (9.67 శాతం) పురుష అక్షరాస్యత (7.49 శాతం) కన్నా అధికంగా వుంది. 1981 సం॥లో 7 సం॥లు పైబడిన అక్షరాస్యులు 234 మిలియన్ల మంది కాగా వీరి సంఖ్య 1991 నాటికి 352 మిలియన్లకు పెరిగింది. ఇదే కాలానికి ఇదే వయస్సు వర్గం లోని నిరక్షరాస్యుల సంఖ్య 302 మిలియన్ల నుండి 324 మిలియన్లకు పెరిగింది. కేరళలో అక్షరాస్యత అత్యధికంగా 90.59 శాతము ఉండగా, తర్వాతి స్థానాలను వరుసగా మిజోరం (81.23 శాతము), లక్ష ద్వీప్ (79.23 శాతము), చండీగఢ్ (78.73 శాతం)లు ఆక్రమిస్తున్నాయి. బీహార్ (38.54 శాతము) రాజస్థాన్ (38.81 శాతము), దాద్రా నాగర్ హవేలీ (39.54 శాతము) – అట్టడుగు స్థానాల నాక్రమించాయి. మహిళల అక్షరాస్యతలో పెరుగుదల సిక్కిం, లక్షద్వీప్, నాగాలాండ్, డామన్, డయ్యు, హర్యాన, మణిపూర్, అండమాన్ నికోబార్ దీవులు, పాండిచేరి, త్రిపుర, కేరళ ప్రాంతాలలో గణనీయంగా ఉన్నది. అక్షరాస్యత జాతీయ స్థాయిలో 52.11 శాతాన్ని మించి 22 రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల్లో ఉన్నది. అయితే బీహార్, రాజస్థాన్, అరుణాచల్ ప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, మేఘాలయా, ఒరిస్సా, దాద్రానగర్ - హవేలీలలో మాత్రం అక్షరాస్యత శాతం జాతీయ సగటుకన్నా తక్కువగా వున్నది..... (ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## మల్టీ నేషనల్స్

బహుళ జాతి కంపెనీలకు (మల్టీ నేషనల్స్) ఇచ్చే ఆహ్వానం మన దేశ ప్రయోజనాల కొరకేనని పదే పదే ప్రకటనలు చేస్తున్నారు. భారత కంపెనీలలో పై స్థాయిలోని అధికార్లకు ఎంత వేతనాలివ్వాలి, ఏయే సౌకర్యాలు ఎంతవరకు కల్పించాలి, ఆయా కంపెనీలో భారత ప్రభుత్వ విధానాలను అనుసరిస్తున్నాయో లేదో చూడడానికి కేంద్ర ప్రభుత్వంలో 'డిపార్టమెంట్ అఫ్ కంపెనీ అఫేర్స్'

ఉన్నది. అటువంటి నియమాలలో ఒక దాని ప్రకారం ఒక ముఖ్య అధికారి విదేశీయుడయితే భారతీయుని కంటె రెండు రెట్ల వేతనాన్ని పొందవచ్చును. ప్రస్తుతం ముఖ్య భారతీయ అధికారికి సాలీనా రు. 1.8 లక్ష గరిష్ఠ పరిమితి వేతనము - దానిని 3 లక్షలకు పెంచుతున్నారు. అంటే నెలకు రు. 25,000/-ల వరకు వేతనము పొందగలరు. అదే విదేశీయుడు అయితే అతని వార్షిక వేతనము రు. 6 లక్షల వరకు పెరుగుతున్నది. కాని ఈ మధ్యనే బెంగుళూరులో తెరువబడే ఒక అమెరికన్ కంప్యూటర్ కంపెనీ తన ముఖ్య అధికారికి సాలీనా 4 లక్షల డాలర్లు (అంటే రు. 1.08 కోట్లు) వేతనం ఇచ్చేందుకు అనుమతిని కోరింది. ఇదే అధికారి భారతీయుడయితే ఏడాదికి రు. 3 లక్షల వరకు మాత్రమే ఇవ్వబడుతుంది. అంతే కాకుండా విదేశీ అధికారికీ వేతనం డాలర్ల రూపంలో ఇవ్వాలి. భారత రాష్ట్రపతి వేతనం నెలకు రు. 20,000/-. ఇలా చూస్తే భారతీయ అధికారుల కిచ్చే నెలసరి వేతనం రు. 20,000 లు లేదా రు. 25,000 కూడా అనుచితంగా కన్పిస్తుంది. భారతదేశంలో ఉండే విదేశీయుడికి ప్రతినెలా రు. 9 లక్షల వేతనం ఇవ్వడం అన్యాయం. దానిపై పన్ను ఆ అధికారి కాక, బహుళ జాతి కంపెనీయే భరిస్తుందట. ఒకే పనిచేసే భారతీయ, విదేశీ అధికారుల మధ్య వేతనంలోని తేడా (36 రెట్లు) భారతీయ అధికారికి అవమానం కాదా ? ఈ అత్యధిక వేతనాల ప్రభావం ఆయా కంపెనీల ఉత్పత్తులపై పడదా ? జర్మనీలో విద్యుదుత్పత్తి చేసే సేమెన్స్ కంపెనీకి మన దేశంలో విద్యుదుత్పత్తి కేంద్ర స్థాపనకు అనుమతి ఇవ్వవచ్చును. ఆ కంపెనీ కార్మికులకు ఇచ్చే కనీస వేతనం రోజూ రు. 50/- మాత్రమే. కాని ముఖ్య వ్యవస్థాపకుడయిన జర్మన్ అధికారికి నెలకు రు. 9 లక్షలు (రోజూ రు. 30,000/-). దీని ప్రభావం ఏ విధంగా ఉంటుంది ?....(సర్వోదయ ప్రెస్ సర్వీసు

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

**JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.**



?

"Dad, I am told but for Sampati the Vanaras could not have found out the whereabouts of Seeta. Who is this Sampati ?" asked Raghu.

"He was the brother of Jatayu that intercepted Ravana while he was abducting Seeta. In the fight Jatayu lost his wings but kept himself alive till Rama came that way and guided him to follow the southern direction," said Raghu's Father.

"Oh, those mighty winged birds that trace their ancestry to Vinata's Son, Garuda, who served Lord Vihenu as a helicopter," observed Raghu.

"That is bad, impolite and improper - helicopter requires fuel and perfect mechanism but Garuda, the mythical bird, derives its supernatural strength from the grace of God. Coming back to your question, when Jatayu and Sapati were quite young and exuberant, they soard high into the sky and the scorching heat made them pay for their rashness. Sampati while saving the brother lost his wings and they both fell down at different spots. Wise man Nishakara looked into the future and consoled Sampati that he would get back his wings after completing *Rama Karya* - that means informing Vanaras about the hideout of Seeta in Lanka. That he did and got back his wings," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



ప్రసంగం

# సలహాలు

## యస్వార్ చందూర్



వినదగు నెవ్వరు సెప్పిన - విని నంతనె వేగపడక వివరింపదగుం - గని కల్ల నిజము దెలిసిన - మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ.... ఎవరేమి చెప్పినా మధ్యలో మాట తుంచేయకుండా, ఓపికగా, వివరంటా వినాలి. అలా విన్న మీదట మనలో మనం తర్జన భర్జన చేసుకు, ఏది మనకు అనుకూలంగా ఉంటుందో, ఆ మార్గం తొక్కాలి. దానినే స్వ ధర్మం తెలుసుకోవడమనీ, స్వధర్మా చరణ అనీ అంటారు. ఎవరి ధర్మం వారు తెలుసుకోవడం, ఎవరి మార్గం వారు అనుసరించడం, మాటలలో చెప్పినంత తేలికకాదు. 'వినదగు నెవ్వరు చెప్పిన' అనేది మనకి తెలుసు. కాని, ఎదుటవారిని పూర్తిగా చెప్ప నీయకుండానే మన అభిప్రాయాలతో ఢీ కొంటాం. మాట పొరనివ్వకపోవడ మనేది కొందరి స్వభావ లక్షణం.

అలాగే కొందరికి అడగకుండానే సలహాలు చెప్పే అలవాటు ఉంటుంది. పొరబాటున నోరు తెరిచి అడిగామా, వారి సలహా పాటించే దాకా మనని వొదిలి పెట్టరు. ఈ లోకంలో అతి క్లిష్టమైనది తనని తాను తెలుసు కోవ డం, అతి తేలికైనది సలహాలు యివ్వ డం - అని వెనకటికి ఒక పెద్ద మనిషి అన్నాడు. ఉచిత సలహాలు యివ్వటం కొందరికి ఎంతో యిష్టం. తమ సువర్ణాభిప్రాయంతో మనని ఒక దరికి జేరుస్తున్నామని వారు అను కుంటారు. కౌన్సిలర్ కాదు, కౌన్సెలర్ కౌన్సెలర్, అడ్వయజర్ రెండు మాట లకీ అర్థం స్థూలంగా ఒకటే అయినప్ప టికీ, వృత్తిపరంగా సలహాలు చెప్పే వారిని కౌన్సెలర్స్ అంటారు. భార్యా భర్తలు కీచులాడుకుంటే, వారి దాం పత్య బంధం నిలిచేందుకు ఉపాయం చెప్పే సలహాదారుని 'మారేజ్ కౌన్సె లర్' అంటారు. సామాజిక సమస్య లకు వృత్తిపరమైన సలహాలు చెప్పే కౌన్సెలర్స్, ఈ మధ్యనే ఎక్కువవు తున్నారు. ఇక, అడ్వయిజర్స్ అం టారూ. రాష్ట్రపతి పాలన ఒక ప్రాంతంలో విధించినప్పుడు, గవ ర్నరుగారు నలుగురు ముగ్గురు ఉన్న తోద్యోగులని తన సలహాదారులుగా వేసుకుంటారు. కౌన్సెలర్స్, అడ్వయి జర్స్‌గాక, కన్సల్‌టెంట్స్ అని మరొక తరహా సలహాదారులు కూడా వున్నారు. సలహాదారు పని సలహా యివ్వడంతో పూర్తయిపోతుంది - అవతలవారు తన సలహా పాటించారా

లేదా అనేది అతనికి అనవసరం; ఆసక్తి కూడా ఉండదు.

మన సంప్రదాయంలో విష్ణువే పృథ్వీపతి - అంటే, రాజుగారు దేవుడితో సమానం. మనకే కాదు — చాలా దేశాలలో అదే పద్ధతి. అందుకే ఇంగ్లీషులోని సామెత The king can do no wrong. రాజెప్పుడూ తప్పు చేయడు; పొరబాటు పడడు గనక ప్రజలందరూ ఆయనని దేవుని అవతారంగా భావిస్తూ, విధేయులై మసులుకోవాలి.

అయితే, ఈ రాజులు చేసిన తప్పులే, వీరి తప్పటడుగులే మొత్తం మానవ చరిత్ర. రాచకార్య నిర్వహణలో సమస్తం తనకు తెలియగల అవకాశం లేదు గనక, మంత్రాంగం చెప్పగల మంత్రిని నియమించుకొనేవాడు రాజు. ఈ మంత్రులు కొందరు సుబుద్ధులూ, మరికొందరు దుష్టబుద్ధులూ అవటం వల్ల, తన స్థానాన్ని భద్రంగా కాపాడే రాజ గురువుని ఆశ్రయించాడు; రాజుకే గురువు గనక, రాజుతో సహా, రాచకొలువులోని వారందరూ ఆయన మాట శిరసావహించేవారు. అమాత్య వరుడు, అంటే మంత్రి చెప్పేది సలహా; రాజగురువు చెప్పేది ఉపదేశం; అంతిమ నిర్ణయం రాజుగారిది. ప్రస్తుతం మనకి అధికార పక్షమూ, ప్రతి పక్షమూ ఉన్నట్లు - వీరిద్దరూ వ్యవహరించేవారు. వీరు గాక సేనాధిపతి - ఆర్మీ ఛీఫ్ - విడిగా వుండేవాడు. జైత్ర యాత్రలోను, అనగా పొరుగు రాజ్యాలు కలుపుకొనేందుకు దండెత్తడంలోను, తమ నగర రక్షణలోను - నగరమనగా అప్పట్లో నాలుగు వైపులా బురుజులు గల కోట - ఈ కోటను రక్షించడంలోను తప్ప, సేనాధిపతి సలహా ఎవరూ అడిగేవారు కాదు; రాచకార్య నిర్వహణలో ఆయన కెటువంటి పాత్రా ఉండేవి కాదు మన జానపద సాహిత్యమంతా రాజుగారి చుట్టూవున్న ఈ త్రిమూర్తుల - రాజ గురువు, మంత్రి, సేనాధిపతుల చుట్టూ అల్లినదే!

రాజుగారు సలహాలు పుచ్చుకుంటారు. కాని, రాజనీతి సారమెరిగి, తనకి తానుగా నిర్ణయం తీసుకోవాలి. ఆ నిశ్చల బుద్ధిగల రాజులు ఎక్కువ కాలం పాలించారు; అది లేనివారు తొందరలోనే సింహాసన భ్రష్టులయారు. సన్నిహితులు చెప్పే సలహాని, వివరించి తెలుసుకోగల శక్తి, సంపన్నునికైనా సరే, సామాన్యునికైనా సరే ఖచ్చితంగా ఉండాలి,

సలహాలు యిచ్చేవారిలో సచ్చింతనులు, సంశయాత్ములు వుంటారు. సంశయాత్ములని దుశ్చింతనులు అనలేము - డౌటింగ్ థామస్‌లు. దేని గురించీ స్థిరమైన అభిప్రాయంలేని వీక్లింగ్స్ - నీరసులు. అటువంటి వారు చెప్పే సలహా, ఎదుటివారికి ఏ విధంగానూ ఉపకరించదు సరిగదా, విష్కారణంగా గోతిలోకి దింపుతుంది. తాము తలమునకా కష్టాల్లో వుండి, ఎదుటవారినేదో లేవనెత్తుదామనుకొని, అడగని సలహాలిస్తూ వుం

టారు కొందరు. వాటినంత సీరియస్ గా తీసుకోకూడదు - వినేసి వూరు కోవాలి.

సలహా ఎందుకు కోరుతారు? మనసులో ఏదో సందేహం మొలకెత్త డం వల్ల! ఇటా అటా అని మనసు వూగిస లాడుతూంటుంది. ఎటు అడుగు వేయడానికి ధైర్యం చాలదు. కాలమే పరిష్కరిస్తుందని కొన్నిటి విషయంలో సరిపెట్టుకోలేము........ సుభద్ర, సూర్యారావు మనస్ఫూర్తిగా ప్రేమించుకున్నారు; ఇద్దరికీ ఉద్యోగాలు వున్నాయి; ఎవరి మీదా ఆధారపడనవసరంలేదు; కాని, కులం కారణంగా సుభద్ర తలిదండ్రులు అభ్యంతరం చెబుతున్నారు. చెల్లెళ్లకి పెళ్లి కాదేమోనని వారి భయం. సుభద్ర ఏం చేయాలి? ఆలోచించండి.... రాజారావుకి ఢిల్లీలో మంచి వుద్యోగం వచ్చింది; జీతం ఎక్కువ, పెరుగుదలకి అవకాశాలు వున్నాయి; 'ఉన్న ఊళ్లో ఉంటున్నాం; అమ్మా నాన్నా ఇరవై కిలోమీటర్ల దూరంలో, అరగంట ప్రయాణంలో ఉన్నారు; అమ్మాయి చిన్నదైనా, అబ్బాయిని వేసవి అయాక 'యల్ కెజి' లో చేర్పించాలి. విజయవాడ వొదిలి నేను ఢిల్లీ రాదలుచుకోలేదు; మీరు వెళ్లడం నా కిష్టంలేదు' - సుమిత్ర అంది రాజారావు ఏం చేయాలి?... మీరు చెబుతారా?.... మరొకటి: 'ఎమ్డి పాసయారు-హాయిగా నర్సింగ్ హెూమ్ పెట్టుకు, కలిగిన వారి దగ్గిర పుచ్చుకు, పేదలకు ఉచితంగా వైద్యం చేస్తూ, మీ చదువుని సద్వినియోగ పర మకోవచ్చు - ఒరిస్సా ప్రాంతాల వున్న పల్లెటూరికి వెళ్తానంటారేమిటి? ఆ ప్రజా సేవ ఏదో యిక్కడ చేయవచ్చు కదా' - అంటుంది సునంద. కాని, సునంద భర్తకి బాగా వెనుకబడ్డ ప్రాంతాలలో సెటిలై, అల్బర్ట్ ష్విట్జర్ మాదిరి ఆదర్శవంతంగా బతకాలనే ఆశయం. సునంద ఏం చేయాలి? శ్రీరామ చంద్రుని వెంట అరణ్య వాసానికి వెళ్లిన సీతాదేవికాదే తను.... ఇటువంటి కొరుకుపడని సమస్యలు అంకురించినప్పుడే, సలహాలు కావాలను కొంటారు.... ఆ సలహా చెప్పేవారు ఉన్నతాత్ములు అయితే, పాటించిన వారి జీవితం శోభాయమాన మవుతుంది.

'మీ మంచి కోరి నేను చెబుతున్నాను - వినండి' అనే ధోరణిలో ఏనాడూ సలహా అనేది ఉండకూడదు. చెప్పేవారి ఆధిక్యత కించిత్ కూడా వెల్లడి కాకూడదు. 'నాకు తోచినది చెబుతున్నాను - మీకుగా మీరు ఆలోచించుకోండి' - అని సూచిస్తున్నట్లుగా వుండాలి మనం చెప్పే సలహా.

భార్యా భర్తలు ఒకరికొకరు, తలిదండ్రులు పిల్లలకు, అధ్యాపకులు విద్యార్థులకు, పెద్దలు చిన్నవాళ్లకు చెప్పే సలహాలు, వారు అడక్కుండా చెప్పే ఉచిత సలహాలు, కేవలం నిరర్థకమైనవి. తల వూపుతారే తప్ప ఎవరి మార్గాన వారు పయనిస్తారు.

అవతలవారు తమ సమస్య చెప్పుకు, మనని అడిగినప్పుడే, మన

అభిప్రాయం చెప్పాలి; సలహా యివ్వాలి. ఆ సలహాని వారు తమ జీవన పరిస్థితులకి అనుగుణంగా విశ్లేషణ చేసుకు, ఎంతమేర ఆచరణ సాధ్యమో, వివరంగా తెలుసుకుంటారు. అందుకనే 'వినినంతనె వేగపడక వివరింపదగున్' అన్నారు.

('ఆకాశవాణి' మద్రాసు కేంద్ర ప్రసారితం - మే 18, 1992

ఒక మంచి పనికి తిలోదకాలు యివ్వదల్చుకుంటే, మీరు చేయవలసింది ఒక్కటే - కమిటీ వేయటం !
—కెట్టరింగ్

ఈ రోజులలో డబ్బు మాట్లాడటం లేదు - మాటా పలుకూ చేకుండా వెళ్లిపోతున్నది. —రెడివింగ్స్

అభూత కల్పనలు సృష్టించుకు ఆనందించడంలో మానవజాతి గల ఆసక్తి అనూహ్యమైనది
—సోమర్సెట్ మామ్

ఆనందమనేది మనలోనూ లేదూ, వెలుపలనూ లేదు - విశ్వాత్మతో మనం ఏర్పరుచుకొనే సమాధానంలో వుంది. —పాస్కల్

జీవితంలో విజయానికి పది సూత్రాలు వున్నాయి. మొదటిది : మనకి కావల్సినది తెలుసుకోవడం; రెండవది : ఆ తెలుసుకున్నది ఆచరణలో పెట్టడం, మిగతా ఎనిమిదీ ఆ రెండింటికీ కాపీలు. —వార్ని రైట్

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నచక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన 'మహానుభావులలో' ప్రకాశరాయడు గారొకరు.... వారి జీవిత గాథలోని సంక్షిప్త భాగాలివి.

అప్పటికి కింకను ఆంధ్రజిల్లాలు మద్రాసు సంయుక్త రాష్ట్రంలోనే కలిసి యుండెను. 'Go and report yourself for duty before Anantapur District Collector' అని telegram వచ్చింది మద్రాసు నుండి. రాట్నం చేత బట్టుకొని, నా దొడ్లో పండించుకొన్న ఎఱ్ఱదూది (నూలు) చొక్కా వేసుకొని, చింపిరిజుట్టుతో అనంతపురానికి రైలెక్కాను. ఈ యుద్యోగానికి నియమింపబడతానని నేను కల గూడ కనలేదు. నాకు తెలియకుండ, నన్నడగకుండ, నా దరఖాస్తు లేకుండ ఆంధ్రకేసరి నాకు కల్పించిన పని ఇది. అప్పుడాయన మద్రాసు సంయుక్త రాష్ట్ర ముఖ్యమంత్రి. కలెక్టరును దర్శించి, నా మకాంకు వెళ్ళి మర్నాడే ఉద్యోగంలో ప్రవేశించాను. ఆనాటి వరకు ఎట్టి ప్రభుత్వోద్యోగ ముఖం ఎరుగని మనిషిని నేను. ఆ జిల్లా కలెక్టరు పేరు ఆర్. గెలిట్టీ. నా యుద్యోగ్యం ఈ తెల్లవాని వద్ద పడ్డదేమిటని ముందర మనస్సు కొంత దిగాలు చెందింది కాని నేను అతనివద్ద పని చేసిన ఏడు నెలలలో అతని యోగ్యత, సమర్థత నన్ను ఆశ్చర్యపరచాయి. అతడు కలెక్టరుగా రాజీనామా చేసి 1947 ఆగష్టు 15 తరువాత స్వదేశానికి వెళ్ళిపోయినాడు. దానికి ఒక రోజు ముందు నాకు తోచినట్లు నేనతనికి ఒక పెద్ద ఉత్తరం వ్రాసి, ఆఫీసు నుండే అతని ఇంటికి పంపించాను. "Now, Sir after seven or eight months' work under you I find to my astonishment that you are a man among men" అని ఆ ఉత్తరం యొక్క సారాంశం.

'The rank is but the guinea stamp. Man is man for all that' అన్న రాబర్టు బరన్సు పద్య వాక్యం కూడ అందులో ఉదాహరించాను. ఆ డిశంబరుతోనే నా ఏడాది Contract ఉద్యోగం కూడ అంత మయింది. ఆంధ్రకేసరి మమ్ము ఈ తాత్కాలిక యుద్యోగాలకు పంపించి నది లంచ పంచాలు పట్టని ధర్మనిర్వ హణ కొరకు. నాకు వచ్చిన నెల జీతం నుండి రెండు వేల రూపాయలు మిగుల్చుకొని ఇంటికి వచ్చి సమిశ్ర గూడెం గడికప్పు ఇంటిని పెంకుటిల్లు వేయించాను. ఉద్యోగకాలంలో నేన ప్పుడూ అలవాటు చొప్పున థర్డ్ క్లాసు లోనే ప్రయాణం చేసి కొంతఖర్చు ప్రభుత్వానికి తగ్గించాను. మొదటి నుంచి నాది పొదుపరి జీవితం. పైసా పైసా కూడ బెట్టి కుటుంబాన్ని పోషించి న సామాన్య సంసారిని. అనంత పురంలో నుండిన సరిగ్గా సంవత్సర కాలంలో జవుళి (వస్త్ర)నూలు వర్తకు లెవరుగాని నేతగాండ్రుగాని ప్రభుత్వో ద్యోగముఖ మెరుగని నన్ను ఏ మాత్రం ఇబ్బందులు పెట్టలేదు. నా వద్ద పనిచేసిన గుమాస్తాలు ఆరేడుగు రుండేవారు. Textile Control ఆఫీసర్లు ముగ్గురు - ఒకరు నూలు పంపకానికి ; ఒకరు వ్యాపారస్థులకు వస్త్ర పంపకానికి ; ఒకరు దొంగ వ్యాపారులపై కోర్టులో కేసులు నడప డానికి. ఒకరు వెళ్ళగా ఒకరు వస్తూ కంట్రోలు ఆఫీసర్లు నమ్మకంగా పని చేసి నా మర్యాదను కాపాడారు. మా అందరిపైన నా వాలకాన్ని బాగా ఎగిరి యుండిన కలెక్టరు గెలిట్టీ ఉండేవాడు. ఒక ఉదాహరణ : నేను పని పుచ్చు కొన్న నెల రోజుల లోపల ధర్మ వరంలో జరిగిన ఒకజిల్లా food committee meeting ముగియగానే నన్ను చూచి 'Are you staying here tomorrow ?' అన్నాడు కలెక్టర్. 'If you want me to stay, I shall' అన్నాను నేను. 'If you happen to stay, will you com and see me ?' అన్నాడతడు. 'By all means' అని చెప్పి మర్నాడు ఉదయం T.B.లో ఉన్న అతని వద్దకు వెళ్ళాను. 'How are you getting on with your office work ? How are your T. C. O's ? Is everything O. K. ?' అని నన్నడి గిన అతని మైత్రీభావం నన్నాశ్చర్య పరచించి. రెండు చేతులు ముకుళించి ఒక దండం పెట్టాను. 'I cannot easily suspect my subordinates అనే అనవసరపు మాట ఒకటి నా నోట వెలువడ్డది. "Oh no, no. If anything goes wrong any where, the whole thing will reflect on you. You must be alert and very attentive in every thing !" అని నాకుwarning ఇచ్చాడు. వయసులో అతడు నాకంటె చిన్నవాడై యుంటాడు. అప్పటికి నా వయస్సు 50 దాటింది. అయినా అతడిచ్చిన warning నన్ను కృతజ్ఞుణి చేసింది. మరొకసారి హస్తాలు మోడ్చి నమస్క-

రించాను. "Thank you, sir, I am very grateful!", అని చెప్పి వెళ్ళి పోయారు.... వ్యక్తి సత్యాగ్రహకాలం. ఇద్దరు రెడ్లను పోలీసులు తీసుకొని వచ్చి విచారణకు ఇతని ముందు పెట్టారు. వీళ్ళను ఒకే ఒక ప్రశ్న గెలెట్టీ అడిగినది 'మీకు రాట్నం వడకటం వచ్చునా ?' అని. అదే రాదా అని వీళ్ళు దబాయించారు. అప్పటి కప్పుడు ఒక రాట్నం, ఏకులు తెప్పించి 'ఏదీ వడకండి' అన్నాడట గెలెట్టీ. కాని వాళ్ళకు రాట్నం తిప్పడం ఏకు పట్టుకొనటం తెలియదు. 'వీళ్ళు గాంధీ మనుష్యులు కారు. వీళ్ళను జైలుకు పంపి అన్నం పెట్టి మేపటం గవర్నమెంటుకు నష్టం' అని వ్రాసి వాళ్ళను ఇంటికి పొమ్మన్నాడట గెలెట్టి....

ఒకసారి చిత్తూరు జిల్లా, వాయల్పాడులో ఏదో అక్రమం జరిగిందని చెప్పి దానిని విచారించి report పంపమని నన్నక్కడికి పంపించాడు కలెక్టరు. ఆ యూరుకు వెళ్ళి అందుకు సంబంధించిన బట్టల వర్తకులకు, పోలీసులకు కబురంపాను. కిందా మీదా పెట్టి నాకు చేతనైన report వ్రాసి కలెక్టరుకు పంపాను. దాని మీద 'Avoid flowers of speech.

Boil the whole thing down to facts and figures' అని వ్రాసి report నాకు తిరిగి పంపించేశాడు. దానిని క్లుప్తంచేసి మళ్ళీ పంపించాను. గెలెట్టికి నావంటి వారి యెడల ఎంత ప్రేమ సద్భావం ఉండెనో నా ఎనిమిది నెలల ఉద్యోగం వల్ల తేటతెల్లమయింది.

అనంతపురంలో ఉన్న మొత్తం ఏడాదిలోను రెండు సార్లయినా నేను వడికిన నూలుతో బట్ట నేయించుకొని ఉంటాను. గెలెట్టి 1947 ఆగస్టులో రాజీనామా పెట్టి వెళ్ళిపోయిన తరువాత గూడ, నేను అక్కడున్న సంవత్సరాంతం వరకూ మరొక కలెక్టరుండేవారు - జోసఫ్ రెడ్డి కాబోలు పేరు.

## 7

1947 జనవరి ఆఖరుతో అనంతపురం పని ముగించుకొని నిడదవోలు యింటికి చేరి 1948 అంతా సూత్రయజ్ఞం, దొడ్లో సేద్యం చేసుకుంటూ ఒల్లకున్నాను. ఏలూరుకు సమీపంలోని గోపన్నపాలెంలో ఆంధ్ర కేసరి 'ఫిర్కా డెవలప్‌మెంటు ప్రణాళిక' అనే కొత్త పేరుతో ఏర్పాటు చేసిన 'గ్రామ సేవక విద్యాలయ' ప్రిన్సిపాలుగా రావలసిందని నాకు పిలుపు వచ్చింది. మొదటే చెప్పుకున్నట్టున్నాను - 1921 గాంధి జాతీయ పాఠశాలతో ప్రారంభించి కడవరకు నేను నిర్వహించిన పనులన్నీ నేను ఒకరిని అడిగి తెచ్చుకొనకుండ నాకు దైవమప్పగించిన జన ప్రియోద్యోగాలే, స్వామి సేవకై నియోగింప బడ్డ కర్తవ్య కర్మలే. అందు రెండే మాత్రం, అనంతపురం జిల్లా Textile Commisionership ఒకటి; ఇప్పుడు చెప్పుకోబోయే గ్రామసేవక విద్యాలయ ప్రధానాధ్యాపకత్వమొకటి. పేరుకు సర్కారు పనులైనా, అవి కూడా 'రారా!' యన్న ఆంధ్ర కేసరి పిలుపుమీద 1947, 1949 లలో నాకు కల్పింపబడ్డ బాధ్యతాయుత కార్యాలే. ముఖ్యంగా 1947 ఉద్యోగాన్ని లంచపంచాల అవినీతికి లోబడకుండ ప్రకాశం ఆశించినట్లే నమ్మకంగా నెరవేర్చి వచ్చానని సగర్వంగా చెప్పుకోగలను.

1949-51 (రమారమి రెండేండ్లు) గోపన్నపాలెం విషయం కొంచెం వివరిస్తాను. గ్రామసేవ నిమిత్తం వచ్చిన రెండు మూడు జట్ల (batches) వయసు వచ్చిన విద్యార్థులకీయబడిన తర్ఫీదు పని అది. నేను బాధ్యత పుచ్చుకోగానే చేసిన పని యేమంటే, ట్రైనింగుకు వచ్చిన ప్రతివాని దుస్తుల పెట్టెలు స్వయంసోదా చేయడం; ప్రతి గ్రామ సేవకుడు స్వంత ఖర్చు మీద రెండు సెట్లు ఖద్దరు దుస్తులు కుట్టించుకొనేటట్లు చేయడం; ఖరీదు పుచ్చుకొని ఒక్కొక్కరికి రాట్నం సప్లయి చేయడం. భోజనం, మధ్యాహ్న విశ్రాంతి అయిన పిమ్మట గ్రామ సేవకులూ, వివిధ విషయాలు బోధించే అధ్యాపకులూ తదితర ఉద్యోగుల కుటుంబాలూ సామూహిక సూత్రయజ్ఞంలో పాల్గొనాలి.

గ్రామ సేవకుల నివాసం, భోజన వసతి విద్యాలయ ఆవరణలోనే. వారు నేర్వవలసిన ఒక్కొక్క విషయానికి (పాఠానికి) ఒక్కొక్క నోట్ బుక్ వారి వద్ద నుండాలి. ఈ విద్యాలయంలో అనుభవ పూర్వకంగా వారు తెలుసుకొన్న విషయాలు వారి గ్రామసేవకు సహాయ పడాలి. పై లైబ్రరీ పుస్తకాల చదువంతగా అవసరం కాదు. గ్రామాలలోని ప్రజా సామాన్య జీవితాన్ని ఒక దారిని బెట్టి, వారి పౌర స్వాతంత్ర్యాన్ని నిలబెట్టడమే 'ఫిర్కాభివృద్ధి' యొక్క ధ్యేయం. కేవలం పుస్తకాల చదువుతోను, కాగితపు పరీక్షలతోను, డిగ్రీల సంపాదనతోను పనిలేని, జీవిత సాఫల్య కర్మక్షేత్ర మిది. నే నడగకుండ యిట్టి విద్యాలయంలో నాకు పని పెట్టడం నా అదృష్టమనుకున్నాను. ప్రజల మధ్య పడి యుండి గ్రామసేవకుడు ఏది చెప్పినా, ఏది చేసినా గ్రామ స్వరాజ్యానికి అదే ప్రథమ సోపానం. గ్రామ స్వరాజ్యమే భారత రాజ్యం కావలెనని ఆంధ్రకేసరి ఎత్తుగడ. ఒక్కమాటలో యిదే గాంధికల గన్న స్వరాజ్య స్వరూపం. అది స్వప్నమే అయింది చివరకు! కల్తీలేని గాంధి ప్రణాళిక A నుండి Z వరకూ అంతా కలిపి యిదే! అది అర్థం కాకను, యిష్టం లేకను దానిని ఈ స్వరాజ్యాధిష్ఠాతలు చీల దీసి చిదుకుల పాలు చేశారు. గాంధి అని యున్నట్లు దాని machinery, పై వాలకమంతా ప్రజారాజ్యమే! మళ్ళీ ఆయనయే అన్నట్లు అది ప్రాణంలేని అస్థి పంజరం; .. గోపన్నపాలెపు గ్రామసేవక విద్యాలయం కథ చెప్పుకుంటున్నాము. గాంధి నిర్మాణ కార్యక్రమానికి, అంటే గ్రామసేవకు ప్రధానాంగమైన ఖాదీ పరిశ్రమకు యిరువురు అధ్యాపకులు -







ఒకరు దూది యేకి, ఏకుల తయారీకి; తర్వాత వేనేతకు వేరొకరు - సత్య నారాయణరాజు, కోటయ్యగార్లు. వారానికి కొకసారి లేక రెండు వారాలకు నాతో సహా గ్రామ సేవ కులు ఒక పరిసర గ్రామానికి వెళ్ళి (సాయంకాలం భోజనం తరువాత) గ్రామసేవను గూర్చిన ప్రసంగాలు, చర్చలు అయిన తరువాత విద్యా లయానికి తిరిగి వచ్చే వాళ్ళం. ఉదయం ప్రార్థన: నిన్నటి పాఠా లను నెమరుకు తెచ్చుకొనడం; తదు పరి వివిధ Subjects మీద అధ్యా పకులు నేర్పే పాఠాలు; కొంత విశ్రాంతి; భోజనం తరువాత సామూ హిక సూత్రయజ్ఞం; కొన్నాళ్ళ కొక సారి గ్రామసేవకులకు ప్రత్యేక సందేశాల నియ్యడానికి పెద్దవారిని రప్పించడం - యిది విద్యాలయ కార్య క్రమం ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మిప్పించమని ప్రాయోపవేశంలో అసు వులర్పించిన మహాత్యాగి పొట్టి శ్రీరాములు మా పిలుపు మీద దయ చేసిన పెద్దలలో ఒకరు.

ఆయన ఇచ్చిన గ్రామసేవా సందే శంలోని కొన్ని ముఖ్యమైన మాటలు నాకు జ్ఞప్తికి వస్తున్నాయి. ప్రాథేయ పూర్వకంగా విద్యార్థుల కాయన చెప్పిన మాటలివి: "కొన్ని నెలలలో మీకీ ట్రెయినింగు పూర్తి కానున్నది. మనమందరం గాంధీ చలువ నీడను ఒక జాతి మనుష్యుల మైనాము. మీరు పైకి వెళ్లి గ్రామసేవకులుగా పని చేస్తారు. భారత గ్రామ సేవలో సూత్ర యజ్ఞానికి ప్రధాన స్థాన ముంది సుమండి! చర్ఖాను నాశనం చేసుకొని, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, ఆత్మ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన జాతి మనది. మరలా దానిని చేపడితేనే స్వాతంత్ర్యం యొక్క నిజరూపం కాన వస్తుంది. మన గ్రామాల ప్రజలకు మీరు నొక్కి చెప్పవలసినవి (1) ఆత్మ పారిశుధ్యం (2) గృహ, గ్రామ పారిశుధ్యం (3) దేశవ్యాప్తంగా నిలువవలసిన సూత్రయజ్ఞం, ఈ విషయాలు మీరు గ్రామప్రజల మనసుకు పట్టించక పోతే, పట్న వాసుల కృత్రిమ భావాలు, వారి జీవిత పద్ధతులు మన నెత్తి కెక్కి సర్వం నాశనమవుతాము - జాగ్రత! ఈ విషయాలు మఱచి పోకుండడా నికి రోజుకు కనీసం అయిదు నిమిషా లతో సూత్రయజాన్ని ప్రారంభించి దానిని వృద్ధి చేసుకోండి" అన్నా రాయన గాంధీ జీవితంలో బోధలోని (1) "Cleanliness in next to Godliness" (2) చర్ఖా మన కామ ధేనువు (3) ఐహికా ముష్మిక సుఖాన్ని మన చేత బెట్టె గీతామాత - ఈ మూడు మాటలను గ్రామసేవకు లకు జ్ఞప్తికి తెచ్చింది పొట్టి శ్రీరాములు గారి సందేశం.

మా విద్యాలయం చూడడానికి ఒక నాడొక ప్రభుత్వ పెద్ద ఆఫీసరెవరో వచ్చారు. ఆయన నొక దగ్గర గ్రామా నికి తీసుకొని వెళ్లాను. అక్కడ ముమ్మ రంగా పని జరుగుతూన్న ఒక బీడి (పొగాకు) పరిశ్రమను ఆయన చూచి

'ఇదొక మంచి గ్రామపరిశ్రమగా ఈ ప్రాంతంలో వృద్ధిచెందితే బాగుంటుంది చాలమందికి చేతినిండా పని దొరుకుతుం'దని Visitors' Bookలో నిరభ్యంతరంగా వ్రాసేశాడు. అది చూచి నా మనస్సు చాలా సంకటపడ్డది.

గ్రామ సేవా ట్రైనీల మూడు batches తర్ఫీదు వరకు మాత్రమే నేను విద్యాలయంలో పనిచేసి, కారణాంతరాలవల్ల, అక్కడి కొందరి పనులు నాకు సరిపడక, విద్యాలయం వదలి యింటికి పోయినాను. మహాత్ముని దృష్టిలోని గ్రామసీమల అభ్యుదయం కోసం ఆంధ్రకేసరి వేసిన ఈ ప్రణాళిక క్రమంగా ఖద్దరు సంస్కృతికి ఖద్దరుజీవితానికి (అంటే నిర్భయ, నిస్స్వార్థజీవితం) దూరమై ఏదో సర్కారుశాఖ కిందికి పోయి, ఇప్పటికిని ఆ సంస్థ ఆ పేరుతో ఉన్నదేమో! గ్రామ సేవకులు వట్టి సర్కారు గుమాస్తాలై (quill drivers) యున్నారని నా అంచనా. సూత్రయజ్ఞం, ఖద్దరు ధారణ, నిర్ణీతమైన దైవ ప్రార్థన, పొగత్రాగుడు వంటి, త్రాగుళ్ల విసర్జన, కడగొట్టు ప్రజల

పట్ల ఏకోదర భావన - యివి క్రమంగా మృగ్యమై యుండవచ్చు. నేను విద్యాలయం పనిలో నున్నపుడు పొగ త్రాగుడుకు బాగా అలవాటు పడిన ఒక చిన్న వానిని బర్తరఫ్ చేయడానికి సిద్ధపడాను.

నేను గోపన్నపాలెపు విద్యాలయం పని మానుకొని పోవడానికి చెప్పుల్లో కాళ్లు పెట్టుకొని యుండిన తరుణంలో, నా ఆఖరు జట్టు గ్రామ సేవకులకు వీడ్కోలిచ్చి పంపివేసే function కూడా వచ్చింది. మామూలు పద్ధతిని ఆ నాటి వీడ్కోలు function ను జరుపడానికి అనంతపురం (హిందూపురం) గాంధీ నిర్మాణ కార్యక్రమ పెద్ద శ్రీ కల్లూరి సుబ్బారావుగారు ఆహ్వానింపబడ్డారు. ఆయన (1951) అధ్యక్ష ప్రసంగంలో నన్ను గూర్చి పలికిన ఒక వాక్యం జ్ఞాపకం వస్తోంది ; "ఈ ప్రకాశరాయడు యిక్కడ రాజీనామా పెట్టి ఎందుకు వెళ్లిపోతున్నాడో నాకు తెలియదు కాని ఆయన యిక్కడ మాత్రమే అధ్యాపతుడు కాడు. 1947 లో ఆయన అనంతపురం జిల్లా Textile అధికారిగా నున్నపుడు గూడ ఎవరి మీదను అధికారం చెలాయించలేదు. అధ్యాపకత్వమే చేశాడు. ఆ సమయంలో నేనాయనను బాగా ఎరిగియుంటిని" అన్నారు సుబ్బారావుగారు. అక్కడ నా పనిని గూర్చి ఆయన బాగా ఎరుగును. నా ఆఫీసుకు అరడజన్‌కు పైగా గుమాస్తాలు, అంతకు కొంచెం ఎక్కువ మంది బంట్లు (peons), ముగ్గురు Textile Control ఆఫీసర్లు ఉండేవారు. అందులో యిద్దరు peons జాఫర్ రెండోవాడు మొహిద్దీన్, ఒకనాడు మేడమెట్ల మీద నిలబడి, పడపడ కొట్టుకుంటున్నారు. ఆ ధ్వని నాకు క్రింది హాలులోనికి వినబడి ఇరువుర్ని పిలిపించి ఎందుకయ్యా పోరాటమన్నాను. ఒకరూ మాట్లాడరు. అప్పటికింకా గెలట్టియే కలెక్టరు. 'మరి యిందుకు ప్రాయశ్చిత్త మేమి'టన్నాను. ఏమీ మాట్లాడరు. "జరిమానా వేయనా, మీ మీద రిపోర్టు చేయనా ?" అన్నాను. మీ యిష్టమన్నారు. "రెండూకాదు నా మనసులో మాట చెప్పమన్నారా ?" అన్నాను. తలలూపారు. "ఇపుడు పదకొండు కదా, ఈ నిమిషం నుండి, రేపు మీరు ఆఫీసుకు వచ్చే పది వరకూ, కాఫీ, టీ, సిగరెట్‌తో సహా ఏ ఆహారం ముట్టుకొనమని, అలా ముందు ప్రయాణం చేయగలరా ?" అన్నాను. తప్పక ఆ మాటకు నిలబడి యుంటామని ప్రయాణం చేశారు. ఇక వెళ్లండని చెప్పి, వాళ్లు వెళ్లబోతుండగా మళ్లీ వెనక్కు పిలిచి "మరొక్క మాట" అన్నాను. "మీ 'అల్లా'కు నా 'అల్లా'కు నమ్మజెప్పడానికి మీతో పాటు రేపు ఆఫీస్ టైమ్ వరకూ నేను కూడ ఏ ఆహారం ముట్టను. ఇది మీరు చేసిన ప్రమాణానికి బలం చేకూరుస్తుం" దన్నాను.

నా సమీపంలో కూర్చున్న హెడ్ గుమాస్తా కళ్యాణ సుందరం లేచి "What sir, what sir, what is

it !" అంటూ నా మాటను అటకాయించబోయినాడు. "అంతేనయ్యా, ఆ సంగతి నీకు తెలియ"దని అతనిని ఊరకుండబెట్టాను. మొ హి ద్దీ న్, జాఫర్లు మర్నాడు ఆఫీసుకువచ్చి తమ ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నట్లు సంతోషంతో చెప్పారు. అంతకు మించిన నా సంతోషాన్ని వారికి వెలిబుచ్చాను. ఈ 1947 కథ నా మిత్రులు శ్రీ కల్లూరి సుబ్బారావుగారు వినియుండిరేమో! 'ఆఫీసరుగా కూడ ఈయన అధ్యాపకుడే' అన్న అభినందన వాక్పత్రం 1951 గోపన్నపాలెం వీడ్కోలు సభలో నాకు ముట్టజెప్పియుండిరి. చిన్న మాట మరొకటి: చాలాకాలం మా 'ధర్మజ్యోతి' పత్రికకు చందాదారుగా నుంటూ ఒకనాడు మా యింటికి వచ్చి "You are a born teacher !" అని నాతో చెప్పి వెళ్ళిన శ్రీ దిగుమర్తి రామస్వామి గారు; నా Intermediate చదువు చివరి నాకు 'Good Conduct' Prize పుస్తకాలిచ్చిన మా గురూత్తముడు. వెంకటరత్నం నాయుడుగారు జ్ఞాపకం వస్తున్నారు. ఇవన్నీ నా చిల్లరి గర్వానికి కారణాలు కాలేదు. నన్నెఱిగిన పెద్దల నుండి వచ్చిన ప్రేమ వచనాలుగా యివి నాకు శిరోధార్యాలు. అదే వాటివిలువ; అదే నాకు పదివేలు; నూరు వేలు!

## 8

నేను గోపన్నపాలెం విడిచి పోయిన 1951 లోనే డాక్టరు వెంపటి సూర్యనారాయణగారు (తెనాలి కండ్ల డాక్టరని ఆయన సార్ధకనామం) నన్ను తెనాలి కాహ్వానించారు. ఎందుకంటే ఆయన తన యింట నెలకొల్పదలచిన స్కూలు అధ్యాపకత్వం నిమిత్తం. 1931 వేసవిలో నేను బళ్ళారి జైలు నుండి విడుదలై ఇంటికి పోయే దారిలో అనుకొనకుండ ఆయనతో నాకేర్పడిన మైత్రి విషయంలో చెప్ప కొన్నట్లు జ్ఞాపకం. అది ఈ నాడెంత స్థిరపడి యున్నదో ఆ నాడు కూడ at first sight ప్రారంభమై అంత గాఢంగా నిలిచి పోయింది. ఆయన ఆస్పత్రిలో పది పన్నెండుగురు వైద్య సహాయక కార్యకర్తలు (assistants) ఉండేవారు. అందరకు చేతి నిండ పని యుండేది. వారి బిడ్డల నందరిని స్కూళ్ళ నుండి తీసివేసి నన్ను నిడదవోలు నుండి రప్పించి, వాళ్ళను నా వద్ద పెడితే సరియైన విద్యాగంధం నడవడి అబ్బుతాయని ఆయన అభిప్రాయ పడ్డారు. పిల్లలను పెట్టుకొని పుస్తక చదువు చెప్పే అలవాటు నాటుకు పోయిందనీ, ఆ పద్ధతిలో మరల నేను ఇముడలేననీ మర్యాదగా ఆయనతో చెప్పి అట్లా ఒక ఏడాది కాలం జరిపి వేశాను. నన్ను ఇబ్బంది పెట్టటం ఆయనకూ ఇష్టంలేదు. ఒక ఏడాది ఊరకుండి ఒకనాడు ఆకస్మికంగా నిడదవోలుకు వచ్చి 'నా కోరికను పునరాలోచన చేస్తారేమోనని వచ్చానన్నారు. ఆయన నట్లా మరల రప్పించటం నా కిష్టం లేకపోయింది. 'మీ ఇష్ట ప్రకారం వచ్చి ఏ పని చేయమంటే ఆ పని చేస్తా'నని డాక్టరుగారితో చెప్పేశాను. 1952 లో వెళ్ళి స్కూలు పని ప్రారంభించాను. కాంపౌండర్ల బిడ్డలతో పాటు మరి కొందరు పిల్లలను కలిపి, నాకొక అసిస్టెంటును కూడ ఇచ్చారు. సుమారు మూడు సంవత్సరాలు సకుటుంబంగా తెనాలిలో నివసిస్తూ, నాకు తోచినట్లు విద్య నభ్యసింప జేసి సూత్రయజ్ఞం, తోట పరిశ్రమలతో సహా పని చేయించి, కొందరు పిల్లలను ఆంధ్ర మెట్రిక్యులేషన్ పరీక్షకు పంపించాను. నా పని పూర్తి చేసుకొని 'డాక్టర్‌గారూ, నేనిక ఇంటికిపోవచ్చునా' అన్నాను. 'మీరు వెడతానంటే నేను వద్దంటానా ?' అన్నారాయన.

అదే సమయంలో అఖిల భారత గ్రామోద్యోగ బోర్డులో దంపుడు బియ్యపు శాఖకు ఒక ఇన్స్పెక్టరు కావలసి వచ్చాడని ఖాదీ కమిషన్ డైరెక్టరు శ్రీ రాఘవన్, డాక్టరు సూర్యనారాయణగారితో చెప్పి దానికి నన్ను సిఫారసు చేశారు. Formal గా నా చేత ఒక దరఖాస్తు వ్రాయించారు. గుజరాత్ రాష్ట్రం నడియాడ్‌తో 15 రోజులు మాత్రం Training కు వెళ్ళి, విజయవాడను ఉద్యోగ కేంద్రంగా చేసుకొన్నాను. నెల జీతమెంత కావాలో ఆ దరఖాస్తులోనే వ్రాయమన్నారు. రెండు వందలు చాలునని

వ్రాశాను. ఆంధ్ర కోస్తా జిల్లాలకు Hand pounding of paddy inspector గా నన్ను నియమించారు. జిల్లాలలో నా వద్ద పనిచేయటానికి ముగ్గురు సూపర్‌వైజర్లు వచ్చారు. వారూ, నేను కలిసి చేతనైనంతగా దంపుడు బియ్యపు పరిశ్రమ వ్యాప్తికి జిల్లాలు తిరిగి శక్తివంచనలేకుండ పని చేశాము. అఖిలభారత బోర్డులో Member-in - charge for Hand-pounded Rice శ్రీ రావుజీ భాయ్ పటేలు, ఆయన అసిస్టెంట్ మెంబరు బాబూపటేల్ ఉండేవారు. నేను వయస్సులో పెద్దవాడ నగుట చేతనేమో వారిరువురకూ నాయందు పరిపూర్ణ ప్రేమ గౌరవాలు ఏర్పడ్డాయి. 'జ్ఞాన వృద్ధ' అని శ్రీ బాబూభాయ్ నాకు పేరుపెట్టాడు. నా వయస్సును బట్టి, ఖాదీ బోర్డులోని ఒక సభ్యుడు అడిగాడట రావుజీ భాయ్ పటేలును ; 'Where could you get such an old man for this job'' అని. ''How old is Andhra Kesari Prakasam ?'' అన్న వేరొక ప్రశ్నతో రావుజీభాయ్ ఆయనకు జవాబు చెప్పాడట ! శ్రీ రావుజీ భాయియే ఈ మాట నాతో చెప్పగా నవ్వుకొన్నాను. రావుజీ భాయ్‌కి నేనూ, నా వద్ద పని చేసిన సూపర్‌వైజరూ అంటే సదభిప్రాయం. ఒకప్పుడు ఇండియా అన్ని రాష్ట్రాలలోను ఒకేసారి దంపుడు బియ్యపు staff తదభిమానుల conferences జరిగాయి. 'మిగతా అన్ని రాష్ట్రాలకు ఇతరులను పంపి మీరే మా విజయవాడకు వచ్చారా ?' అని శ్రీరావుజీభాయ్‌కి నా సంతోషాన్ని







వెలిబుచ్చాను. I have purposely come to see you'' అన్నాడాయన. Conference జరిగిన ఒకటిన్నర రోజులూ శ్రీ రావుజీ భాయ్, నేను పెట్టిన దేదో తింటూ నా ఇంట్లోనే ఉన్నాడు. ఆయన గాంధీజీకి దగర అనుచరుడు. చివరికెక్కడో ఒక మోటారు accidentలో ఆయన చని పోయాడు. ఆయన పోయినా ఆయన రూపం ఒక ఫొటోలో నా వద్ద వుండటం నా అదృష్టం. ఊళ్ళ పర్యటనలో సూత్రయజ్ఞం నాకు బాగా జరగటం లేదన్నాను - శ్రీ రావుజీ బాయ్‌తో నేనొకసారి. నా మాట ఆయనకు విడ్డూరంగా తోచింది. 'నేనెక్కడున్నా ఏ స్థితిలో నున్నా ఆఫీసులోను, ప్రయాణాలలోను నా సూత్ర యజ్ఞానికి భంగం కలుగదు' అని చెప్పి నా మాటను పూర్వపక్షం చేశాడాయన. అంత నిష్ఠాపరుడాయన. ఒక దంపుడు బియ్యపు పనిలోనేకాదు. బోర్డు మెంబరుగా ఆయన వంటి శ్రమ జీవి నా కగపడలేదు. ఆయన అసి స్టెంటు శ్రీ భావుభాయ్ పటేలు అంతే. నేను పని విరమించిన తరువాత శ్రీ భావుభాయ్ రాజమండ్రి మీదుగా వెడుతూ చూడటానికి వచ్చి నన్ను కృతజ్ఞుణ్ణి చేశాడు. రాజమండ్రి మిత్రు లందరినీ ఆయనకు పరిచయం చేశాను. నేను విజయవాడలో Inspectorగా ఉంటూనే, డబ్బు చాలక, ఇక్కడ అహార దినుసులు కొనుక్కొనటం కొం చెం కష్టంగా ఉంటోంది ; నాకు బోర్డు ఇచ్చే రెండువందల జీతాన్ని మరొక ఇరవైకో, ఇరవైఅయిదుకో హెచ్చింప గలరా ?' అని చనువుతో శ్రీ రావుజీ భాయ్‌కి ఉత్తరం వ్రాశాను.

అది వెళ్ళిన పది పదిహేను రోజుల లోపలే ''Prakasarayudu's monthly remuneration is refixed at two hundred and fifty'' అని ఉత్తరం వచ్చింది. అంత మంచి తనంతో నాకా మహానుభావుడు భక్తిభాజనుడైనాడు. నా అవసరాన్ని గుర్తించియే ఆయన ఆ పని చేశాడను కోండి. అంతేకాదు - నా పట్ల ఆయన కుండిన సదభిప్రాయం అంతగా ఇను మడింపటయే అక్కడి ముఖ్య విష యం. నా కుండిన ముగ్గురు సూపర్ వైజర్ల దైనిక సూత్రయజ్ఞ వివరాలు వారి నుండి తెప్పించుకొని, ఆ రికార్డు నా వదనే ఉంచుకొనే వాడినో, శ్రీ రావుజీ భాయ్‌కి పంపేవాడనో బాగా గుర్తు లేదు. దంపుడు బియ్యం, సూత్ర యజ్ఞం - రెంటిదీ దేశాభ్యుదయ ప్రణాళికలో ముఖ్యస్థానం.... 'అఖిల భారత ఖాదీ బోర్డు' ఖాదీ గ్రామో ద్యోగ 'కమిషన్'గా మార్పు చెంద గానే ఉద్యోగ నిబంధనలన్నీ ప్రభుత్వ పరం కావటం వల్లను, నా వయస్సు కూడ మించి పోయినందు వల్లను, కమిషన్ వారు నన్ను పనినుండి తప్పుకోమన్నారు. (ఇంకా వుంది

డైరీ

ఏప్రిల్ 28, 1992

సోవియట్ కల్చరల్ సెంటర్, రష్యన్ కల్చరల్ సెంటర్ అయాక, ఆ ప్రాంగణంలో ప్రవేశించడం యిదే మొదటిసారి. పైకి పేరయితే మారింది గాని మిగతా అంతా మామూలే. విజి పన్నీరుదాస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్ అండ్ కల్చర్ (VG Paneerdas Institute of Art & Culture) వారు గోల్డ్‌బాండ్ స్కీముపై (Gold Bond Scheme) ఒక సెమినార్ ఆర్గనైజ్ చేశారు. ఇలాటి వాటిలో విజిపి సంస్థ అధినేత 'సంతోషం' ఎప్పుడూ ముందున వుంటారు.... "1991 జులై 21వ తేదీన గోల్డెన్ బీచ్‌లో ఒక సెమినార్ జరిపాము. ప్రపంచ ప్రఖ్యాత విజ్ఞానవేత్త స్వామినాథన్, పాండుచ్చేరి విశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్స్‌లర్ వెంకట సుబ్రమణియన్, తమిళనాడు విద్యామంత్రి అరంగనాయగమ్, 'ఈ వి ని ం గ్ మెడ్రాస్' ఎడిటర్ ఎయస్ రామన్ - ఈ చర్చాగోష్టిలో పాల్గొన్నారు. గోల్డ్ బాండ్ స్కీము ప్రవేశబెట్టి, సంపన్న కుటుంబాలలో స్తబ్ధంగా పడి వున్న బంగారాన్ని వెలికితీసి, 'మీ బంగారం ఎక్కడికీ పోదు - భద్రంగా ఉంటుంది' అని వారికి నమ్మకం కలిగించి, జాతీయ బాంకుల ద్వారా బంగారాన్ని సేకరించడం, మన ఆర్థిక వ్యవస్థను బలపరుస్తుంది - అనే అంశంపై తీర్మానాలు గావించి, వాటిని కేంద్ర ఆర్థిక మంత్రి మన్‌మోహన్ సింగ్‌కి ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షుడు ప్రణబ్ ముఖర్జీకి తమిళనాడు ముఖ్యమంత్రికి, తమిళనాడు గవర్నరుకి, భారత రాష్ట్రపతికి పంపాము. మేము చేసిన సూచనలు హర్షిస్తూ, పరిశీలిస్తామని వ్రాసినందుకు మా ధన్యవాదములు.

"ఈనాటి సెమినార్‌లో ఆర్థిక రంగంలోని నిష్ణాతులు పాల్గొంటున్నారు. 1) అయిదు కిలోల బంగారం విదేశాల నుంచి తీసుకురావచ్చుననీ, పది గ్రాములకి రు. 450/- చొప్పు దిగుమతి సుంకం చెల్లించవలసి వుంటుందనీ కేంద్ర బడ్జెట్‌లో పేర్కొన్నారు. ఆ సుంకం రు. 450/- నుంచి రు. 150/- తగ్గిస్తే, బంగారం దిగుమతి పెరుగుతుందని మా అభిప్రాయం; 2) తమవద్ద నున్న బంగారం ఏ

జాతీయ బాంక్‌లోనైనా డిపాజిట్ చేసి, అయిదేళ్ల గోల్డ్ బాండ్ పొందగల అవకాశం ఉండాలి. ఈ వడ్డీరేటు మామూలు రేటుకి కాస్త అధికంగా, ఆరు నెలలదో, సంవత్సరానిదో ఆ వడ్డీ, కాల పరిమితి అయాక గాక, ముందు యిచ్చే ఏర్పాటు వుండాలి; 3) దేవాలయ బంగారాన్ని జాతీయ బాంకులో భద్రపరిచి, ఉత్సవ సమయాన మాత్రమే బయటికి తీసే ఏర్పాటు చేస్తే, యిటు ఆలయ ఆదాయమూ పెరుగుతుంది, అటు బంగారానికీ రక్షణా ఉంటుంది; 4) విమానాశ్రయంలోనే గోల్డ్ బాండ్స్ జారీ చేయగల సదుపాయం వుంటే క్రయిమ్ తగ్గుతుంది; 5) టూరిస్టులు తెచ్చే బంగారం విషయంలో నూరు గ్రాములదాకా పట్టింపు వుండకుండా వుంటే మంచిది.... ఇలాటివి కొన్ని ఈ చర్చా గోష్ఠిలో పరిశీలింపనున్నాము'' - అన్నారు సంతోషం, ఆహూతులకు స్వాగతం తెలుపుతూ!

''బంగారం నిల్వలే మనని బయటపడవేయాలి. ప్రతి రూపాయిలోను 23 పైసలు బయటనుండి తెచ్చుకున్న అప్పులకి వడ్డీగా కడుతున్నాం. మన జాతీయ ఆదాయంలో 30 శాతం వడ్డీల కిందనే వెళ్లిపోతోంది; అది 42 శాతం దాకాకూడా దేకవచ్చు. సహజ సంపద, ఉత్పత్తులు వేరు; కరెన్సీ (ద్రవ్యం) వేరు; కరెన్సీకి ప్రాణం పోసేది బంగారం; బంగారం నిల్వలు ఖజానాలో అధికంగా ఉంటే, తక్కువ వడ్డికి అప్పు పుడుతుంది'' అన్నారు కస్టమ్స్ కలెక్టరు సికె గోపాలకృష్ణన్ .. ''రహస్యంగా దాచివుంచిన బంగారం వెలుపలికి తీయడం ద్వారా, మన ఆర్థిక వ్యవస్థను పటిష్టవంతం చేయడానికి సాయపడిన వారవుతారు. బాంకులలో డబ్బు ఎంత భద్రంగా ఉన్నదో, బంగారం కూడా అంత భద్రంగానే ఉంటుంది - అనే నమ్మకం ప్రజలలో నెలకొల్పాలి. గోల్డ్ బాండ్ స్కీము ఎంతో ప్రయోజనకారి'' - అన్నారు అధ్యక్షత వహించిన ఇండియన్ ఓవర్సీస్ బాంక్ ఛెయిర్‌మాన్ పియస్ గోపాలకృష్ణన్. ఇన్‌కమ్‌టాక్స్ ఛీఫ్ కమిషనర్ వియమ్ సుబ్రమణియన్, 'ఈవెనింగ్ మెడ్రాస్' ఎడిటర్ ఎయస్ రామన్, పార్లమెంట్ మెంబర్ శ్రీధరన్, ఛార్టర్డ్ అకవుంటెంట్ ఆర్ సుబ్రమణియమ్ చర్చావేదికలో పాల్గొన్నారు. శెల్వరాజ్ వందన సమర్పణ .... బంగారం యినప్పెట్టెలో పెట్టి తాళం వేయడం కాదు; ఆ సువర్ణం సామాజిక ప్రగతికి దోహదకారి కావాలి - అని అందరూ ఒకే మాటగా చెప్పారు.

..... 29

పాతికేళ్ల క్రితం ఒక లక్ష రూపాయిలతో ప్రారంభమై 'యిప్పుడు సాలీనా పదిహేను కోట్లు టర్నోవర్ గల, మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్ ఏజన్సీస్ అనే వ్యాపార సంస్థ (ఇయస్ రెడ్డి), మార్షల్స్ రోడ్‌లోని రాజా ముత్తయ్ హాలులో, సిల్వర్ జుబిలీ జరుపుకుంది.... ''జయప్రకాశ్ నారా

యణ్ ప్రభావంలో, నా మార్గమేమిటో నాకు తెలియని రోజులలో, "బెజవాడ గోపాలరెడ్డిగారి కుటుంబమూ, విజయా నాగిరెడ్డిగారి కుటుంబమూ మరికొందరు మిత్రులూ నన్ను ఒక దారిలో పెట్టి అండగా నిలిచారు. వారి అభిమానమే నన్ను ఈ ఉన్నత స్థితికి తెచ్చింది," అంటూ ఇయస్ రెడ్డి, తన విజయం వెనుకనున్న వారికి కృతజ్ఞత తెలుపుతూ, ఆహూతులకు స్వాగతం పలికారు .. కెమికల్స్ అండ్ ప్లాస్టిక్స్ ఎగ్జిక్యూటివ్ డైరక్టరు కె రామ్మూర్తి అధ్యక్షత వహించగా, కలర్ - ఖెమ్ 'యమ్‌డి' కె ఆర్వి సుబ్రహ్మణ్యం ప్రారంభోత్సవం గావించారు. పారిశ్రామికవేత్త ఓబుల్‌రెడ్డి ముఖ్య అతిధి.... యమ్ నోల్, మిసెస్ మీనా దేశ్‌పాండె, జయంత్ ధొతె, ఓం ప్రకాశ్ భార్గవ, వి మోహన్‌రావు, హెచ్‌జె దోషి, మిసెస్ వకీల్, యఫ్‌ఎ వకీల్, సంజయ్ ధొతె, బి విశ్వనాధ రెడ్డి, అక్కమ్మా కృష్ణమూర్తి మున్నగు వారు అభినందనలు తెలిపారు. ప్రసంగాలు రెండు మూడు నిముషాలకు పరిమిత మవడంవల్ల, ఆరు గంటలకు ప్రారంభమైన సభ ఏడూ ఇరవైకి ముగిసింది - ఏడున్నరకి విందు.

. . . . . 10

న్యూయార్క్, షికాగో, లాస్ ఏంజిలిస్, వాషింగ్టన్, మాస్కో, టోక్యో, బెర్లిన్, పారిస్, లండన్, సింగపూర్, హాంగ్‌కాంగ్ యిలాటి చోట్లకు వెళ్లి వచ్చిన వారిని, అక్కడ వున్నవారిని

# ముఖ చిత్రం

వనమహోత్సవం ప్రభుత్వంవారి వార్షిక పండగ. ఈ పండగల వల్ల ఎటువంటి మేలూ జరగలేదనే చెప్పవచ్చు. ఆ ఏటికాఏడు మన అడవులు తరిగిపోతున్నాయి - ధ్వంసమవుతున్నాయి. ప్రాజెక్టులూ పరిశ్రమలూ మన అటవీ సంపదని, వృక్ష సంతతిని మింగేస్తున్నాయి. ఎన్విరాన్‌మెంట్, ఎకాలజి, ఎకో - సిస్టమ్ (పర్యావరణం) ఈ మాటలు బహుళ వ్యాప్తినొందాయి - ఇందు గురించిన సెమినార్లు భారీ ఎత్తున జరుగుతున్నాయి. సుందరలాల్ బహుగుణవంటి వారు ఒంటరి పోరాటం సాగిస్తున్నారు. 'తుపానుల నెదుర్కొన్న వృక్షశాఖల ఆకులు, నేల రాలుతూ పడే వేదన నాకు తెలుసు' - అన్నాడు డిహెచ్ లార్‌న్స్. సూది మందూ మరరంపమూతో మహా వృక్షాలని నేల కూల్చే రోజులలో, ఆ కవితా వాక్కెవరికి కావాలి ? 1992 జూన్ 'రయో' (బ్రెజిల్) భూశిఖరాగ్ర సమావేశంలో (ఎర్త్ సమిట్), పర్యావరణ పరిరక్షణ ప్రధానాంశం. ప్రపంచ వ్యాప్తంగా ప్రకృతి వొడిలో బతికుతున్నారు 25 కోట్ల ఆదిమ జాతులు. స్పర్ధగాక సామరస్య మనేది వారి నుంచి నేర్చుకోవాలి. 'సేవ్ అవర్ వుడ్స్' అనే ప్రదర్శనలో హాన్స్ వర్ని చిత్రం.... 'జర్మన్ ట్రిబ్యూన్' సౌజన్యంతో.

కలుసుకున్నాను గాని 'సైబీరియా' లో పదిహేనూ ఇరవైరోజులు గడిపిన జర్నలిస్టుని యింతదాకా నేను కలుసుకో లేదు, అతనే మాయింటికి వాళ్లమ్మ గారితోను (సరళా సూర్యారావు - మాజీ రాష్ట్రపతి గిరిగారి అమ్మాయి), అంకుల్‌తోను (యమ్మారెఫ్ మోహన రావు) మా యింటికొచ్చాడు. సాయి నాధ్ కాలేజీ విద్యార్థిగా ఉన్నట్నుంచీ బాగా తెలుసు - కాని, కెవి అబ్బాస్ 'బ్లిట్జ్'లోని తన 'లాస్ట్ పేజీ'కి యితనిని వారసునిగా చేస్తాడనీ, ఎందరో మహా మహులు వుండగా కరంజియాని మెప్పించి, 'బ్లిట్జ్'కి ఛీఫ్ డెప్యూటీ ఎడిటర్ కాగలడనీ, అప్పట్లో ఎవరం అనుకోగలము? ఇటువంటి యువకు లని చూస్తున్నప్పుడే, ఈ దేశం చెడి పోలేదు, బంగారు భవిష్యత్తు నిర్మించ గల యువతని భరతమాత తయారు చేసుకుంటున్నది - అనిపిస్తుంది 'పది పన్నెండు నిముషాలు మాత్రమే - మళ్లీ యింకోచోటుకి వెళ్లాలి' - అని ముందే చెప్పారు మోహనరావు.... యోగక్షేమాలయాక, మాటలలో ట్రాన్స్ సైబీరియన్ రైల్వే ప్రస్తావన వచ్చింది వ్లాడివాస్టక్ నుంచి సైబీరియా మీదుగా మాస్కోనగరం పదిరోజు లలో చేరుకొనే ఈ రైలు, ఒక్క నిముషం కూడా లేటదవట - చాలా మంది చెప్పారావిషయం. సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి, జార్ ప్రభువు కాలంలో రష్యన్ ఖైదీలకు సైబీరియా పంపడం... ఆ మాటలు రాగానే "నేను సైబీరియాలో మూడు వారాలు వున్నాను' - అన్నారు సాయినాధ్ 'ముందు ఆ విషయాలు చెప్పండి' - అని నా కోరిక....

"ఒక మిలియన్ సంవత్సరాల క్రితం ఈ భూమిని ఢీకొన్న ఒకానొక ఉల్కాపాతం కారణంగా సైబీరియా ఏర్పడింది - అంతటి రొచ్చునేల, మంచుతో గడ్డ కట్టుకుపోయే నేల మరింకెక్కడా చూడం. తూర్పు ఆసియాలో యూరల్ పర్వతాల నుంచి, బేరింగ్ జలసంధి దాకా వ్యాపించి వున్న సైబీరియా వైశాల్యం ఒక కోటి చదరపు కిలోమీటర్లకు పైగా ఉంది. పశ్చిమ సైబీరియా నిండా పచ్చిక బయళ్ళు - స్టెప్పీస్. మధ్య సైబీరియాలో 4,270 కి॥మీ॥ పొడవుగల లీనా నది. 31,500 చ॥ కి॥మీ॥ బాయకల్ సరస్సు చాలా పెద్దది. లీనా నది సంవత్సరంలో తొమ్మిది నెలలకి పైగా గడ్డకట్టుకు పోయి ఉంటుంది. మంచు కరిగాక నీటి పారుదల; బురదలో నుంచి పుట్టుకొచ్చే దోమలు; రీన్‌డీర్లపై (ధృవ జింకలు) ఈ దోమల విజృంభ ణతో అవి పరుగు తీయగా నోట్లో ముక్కులో ప్రవేశించగా, ఊపిరాడక గుండె ఆగి ఆ ధృవ జింకలు వేల సంఖ్యలో మరణిస్తాయి. ('బలవంత మైన సర్పము చలి చీమలచేత చిక్కి చావదె') ప్రపంచంలో ఎక్కడా లేనివి, మొలవనివి వృక్షజాతులు ఈ సైబీరియాలో ఉన్నాయి. ఇక్కడ నీరు పరిశుభ్రమైనది, అతి స్వచ్ఛమైనది. ఒక నాణెం నీటిలో పడేస్తే, 130

మీటర్ల లోతున కూడా అది కని పిస్తుంది. ఇక్కడి మొక్కలూ, చెట్లూ మరొక ప్రాంతానికి తీసుకు వెళ్లి నాటినా అవి పెరగవు. సైబీరియాలో ఉన్న మట్టికీ, ఈ భూమ్మీద మిగతా చోట్ల వున్న మట్టికీ మౌలికంగా తేడా ఉంది. నేలలో గట్టితనం లేదు, స్థిరత్వంలేదు - అంచేత, ఇరవై అడుగుల పునాదులు లేపి, ఆ పునా దుల మీద ఇళ్లు కట్టుకోవాలి. సైబీరి యాలో అనేక ఆదిమజాతులు వున్నాయి; వారే అక్కడి చలిని తట్టుకు జీవించగలరు. ఎస్కిమోలకు, వారికి పోలికలు కనిపిస్తాయి. మిగతా ప్రపంచం వేరు, సైబీరియా వేరు - అనేది అక్కడ పాదం మోపగానే మనకు స్ఫురిస్తుంది" - అన్నారు సాయినాథ్.

. . . . . 11

మద్రాసు ఈస్ట్ రోటరీ క్లబ్ వారు (కార్యదర్శి : పలనియప్పన్ - కమ్యూ నిటీ సర్వీస్ డైరక్టరు : పివిఆర్ కృష్ణా రావు) 'ఇంటలెక్చుయల్ ప్రాపర్టీ రైట్స్' (Intellectual Property Rights) అనే అంశం మీద (Their Implications and Impact on National Sovereignty and Economic Development) బొంబయి 'బ్లిట్జ్' డెప్యూటీ ఛీఫ్ ఎడిటర్ పి సాయినాథ్ ప్రసంగం 'సియల్ఆర్ఐ'లో (CLRI - Central Leather Research Institute) ఏర్పాటు చేశారు. 'ఇంటలెక్చుయల్ ప్రాపర్టీ రైట్స్' అంటే మేధో జనిత ఆస్తి హక్కులు - సాహిత్యం, కవిత్వం, చిత్రలేఖనం, వైజ్ఞానిక పరిశోధన వంటివి మేధస్సు నుంచి వచ్చాయి గనక మేధోజనిత ఆస్తులు. అసలు ఈ 'ఇంటలెక్చుయల్ ప్రాపర్టీ' అనే మాట గత ఏడెనిమిదేళ్లలోనే వ్యాప్తిలోకి వచ్చింది - అంతకి పూర్వం యివన్నీ కాపీరైటు కింద, పేటెంట్ రైట్ కింద వచ్చేవి. ఒక కొత్త సరుకు తయారు చేశాము; అందులో ఈ పదార్థాలు ఈ నిష్పత్తి లో ఉన్నాయి అని వ్యాపార రహస్యా న్ని, ఆ వస్తువు పేరుని ప్రభుత్వ రక్ష ణతో నమోదు చేయించుకోవడాన్ని 'పేటెంట్' అంటారు.

"ఇండియన్ పేటెంట్స్ ఆక్ట్ 1852లో అమలులోకి వచ్చింది. 1872లో, 1873లో, 1882లో, 1911లో సవరణలు పొంది, 1970 లో ప్రస్తుతపు రూపు తీసుకుంది. ఏ పేటెంట్ అయినా, దాని కాల పరిమితి 14 ఏళ్లు; మందులు, ఆహార పదార్థా లకు సంబంధించినదైతే 5 నుంచి 7 ఏళ్లు మాత్రమే. అలాగే, ట్రేడ్ మార్కు లకి, డిజైనులకి కాపీరైట్‌కి వేర్వేరు చట్టాలు వున్నాయి.

"విక్స్ ఇన్ హేలర్, విక్స్ టాబ్లెట్స్ - యిలా రొంప, పడిశానికి విక్స్‌వారి సరకులు వున్నాయి. వారు ఆ సరకుని ఇండియాలోనే తయారు చేయాలి, ఎక్కడో తయారు చేసు కొచ్చి యిక్కడ అమ్ముతామంటే మన న్యాయ శాసనం వొప్పదు. ఈ ఉత్ప

త్తిలో భారతీయుల పాత్ర ఉండాలి; ఆ సరుకు మన ప్రజలకు చవకగా లభించాలి ... పిరొక్సికామ్ అనే రస ద్రవ్యం, పెల్డిని అనే వ్యాపార నామ ధేయంతో, ఇండియాలో పది మాత్రలూ 18 రూపాయిలకు దొరుకుతాయి. అదే సరుకు, అవే మాత్రలు అమెరికాలో అయితే పది ఖరీదు రు. 520/- ఎక్కడ 18, ఎక్కడ 520 ? ఇంచు మించు 30 రెట్లు అధికమా ? 'గాట్' (GATT – General Agreement on Tariffs and Trade) 'స్పెషల్ - 301' యిలాటివన్నీ మూడవ ప్రపంచ దేశాలని అందమైన మాటలతో దోచుకొనేందుకు.

"ఈ శతాబ్ది అరవైలలో బజాజ్ కంపెనీ, ఇటలీ వారి వెస్పాని (Vespo - Piaggio) ఇండియాలో తయారుచేసేందుకు వొప్పందం గావించుకుంది. ఆ ప్రకారమే వెస్పా స్కూటర్లు 1971 దాకా ఇండియాలో తయారయాయి. సంయుక్త ఉత్పత్తి టైము అయిపోయాక, బజాజ్ కంపెనీ, వెస్పా వారి డిజైను మార్చి, కొన్ని చేర్పులు గావించి, బజాజ్ స్కూటర్ల ఉత్పత్తి ప్రారంభించింది. 'బజాజ్' తమ డిజైనుని కాపీ కొట్టినట్లుగా వెస్పా ఉత్పత్తి దారు 'పియాగియో', బజాజ్‌పై రాద్ధాంతం చేసి విరుచుకు పడ్డాడుగాని చేయగలిగేదేమీ లేక పోయింది. ఎనభైలలో బజాజ్ స్కూటర్లు పశ్చిమ జర్మనికి ఎగుమతి అయాయి. పేటెంట్స్‌కి సంబంధించిన పారిస్ కన్వెన్షన్‌లో పశ్చిమ జర్మనీ సంతకం వుంది గనక బజాజ్ స్కూటర్లు అమ్మడానికి వీల్లేదని ఇటలీ పేచీ పెట్టింది అదృష్టవశాత్తూ ఇండియా ఆ వొప్పందాన్ని ఆమోదించలేదు.... జర్మనీలోని కింద కోర్టులో బజాజ్ కంపెనీకి జుల్మానా పడింది; పై కోర్టులో కొట్టేశారు; ఇంకాపై కోర్టు కెళ్లగా బజాజ్‌దే తప్పన్నారు. ప్రాణం విసిగి, యిద్దరూ కోర్టు వెలుపల వొప్పందానికి వచ్చారు. బజాజ్ మాదిరి ధనం నీళ్ల ప్రాయంగా ఎందరు ఖర్చు పెట్టగలరు ?

"అమెరికా రాను, రాను, ఆవు మీది దూడ మాది, చెట్టు మీది ఫలం మాది అనే స్థితికి తన పేటెంట్ సూత్రాలని పట్టుకొస్తున్నది. తమకి అనుకూలంగా మన పేటెంట్‌కి ఆక్ట్‌ని మార్చాలట 'ఇంపోర్టేషన్' అనే కొత్తమాటతో మనని వంచింపజూస్తున్నది" - అన్నారు సాయినాథ్. ఇది 30వ ఉపన్యాసం ఇంతదాకా 29 కాలేజీలలో ఈ విషయమై మాట్లాడారు. సభాధ్యక్షులు స్వామినాథన్, రోటరీ అధ్యక్షులు సతీష్ రావు, మిగతా శ్రోతలతో బాటు ఎంతో శ్రద్ధగా ఆలకించారు. (Patent Folly అనే బుక్ లెట్‌లో యిందుకు సంబంధించిన పూర్వాపరాలన్నీ వివరించారు సాయినాథ్. పది రూపాయిలు మనయార్డర్ చేస్తే, కాపీలు వుంటే పంపుతారు (The

Indian School of Social Sciences, 5 E, ENSA Hutments, Mahanagara Palika Marg, Near Azad Maidan, Fort, Bombay 400 001.

. . . . 12

మైలాపూర్ అకాడమీ వారి 39వ వార్షికోత్సవ సందర్భంగా న్యూ వుడ్ లాండ్స్‌లో ప్రయిజ్ డిస్ట్రిబ్యూషన్. సెక్రటరీ వీరరాఘవన్ స్వాగతం తెలిపారు; ఛెయిర్‌మాన్ యన్ని రాఘవాచారి, ప్రెసిడెంట్ యస్వి నరసింహన్ సభా కార్య క్రమంలో పాల్గొన్నారు. మద్రాసు రిఫైనరీస్ మేనేజింగ్ డైరక్టరు కృష్ణమూర్తి బహుమతి ప్రదానోత్సవానికి అధ్యక్షత వహించగా, మదర్ థెరిసా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షురాలు యస్ లక్ష్మి, ఇండియన్ వోవర్‌సీస్ బాంక్ ఎగిక్యూటివ్ డైరక్టరు కె సుబ్రమణియమ్, మద్రాసు యూనివర్సిటీ రిజిస్ట్రార్ గోవిందరాజులు, ప్రయిజు లందుకున్న విద్యార్థినీ విద్యార్థులను అభినందించారు. సాంఘిక సేవలోను, వికలాంగులను అదుకోవడంలోను, పేదలకు ఉచిత వైద్య సదుపాయం లోను, కాలేజీ స్టూడెంట్స్ ప్రతిభను గుర్తించడంలోను, మద్రాసు పౌర జీవనంలో, మైలాపూరు అకాడమీది ఒక గణనీమయగు విశిష్ట స్థానం.

—యవ్నార్ చందూర్

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..................................................................

అడ్రసు ..................................................................

..................................................................

..................................................................

తేదీ : సంతకం

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

చిత్రజగ

సమీక్ష

### నళిని సినీ క్రియేషన్స్
### పెళ్ళానికి ప్రేమ లేఖ ప్రియురాలికి శుభలేఖ

కథానాయకుడు రాజా (రాజేంద్ర ప్రసాద్) పెళ్లాం కీర్తిని, ప్రియురాలు స్వాతిని (శృతి - నందిని) నేర్పుగా మేనేజ్ చేస్తూ, వారం రోజులు టూరుకి వెళ్లినప్పుడు భార్యకు సినారె స్టయిల్‌లోను, ప్రియబాంధవికి వేటూరి సుందర రామమూర్తి వరవడిలోను కవిత్వంలో లెటర్స్ వ్రాసి, పొరబాటున అడ్రసులు తారుమారు చేయటంతో కొంపలంటుకుంటాయి. డ్రిలు మాస్టరు స్వాతి మసాలా టీ కోసం వెలుతురు రాక పూర్వమే జాగింగ్ కంటూ బయలుదేరుతున్న భర్త పట్ల కాస్త సంశయాకుల చిత్తురాలవుతుంది స్వాతి. బాగా పొద్దెక్కాక మేలుకొలుపు పాడితేగాని లేవని ఈ పెద్ద మనిషి యింత పొద్దుటే, చీకటి తెరలు తొలగక ముందే బయటికి వెళ్తున్నాడంటే ఏదో కారణం వుండాలి. ఇంటి నౌకరు సన్నాసి కూపీలు తీస్తూ వుంటాడు. రైలు కుదుపు లేనిదే నిద్ర పట్టని టికెట్ యినస్పెక్టర్, ముగ్గుర్ని (హిందీ, తమిళ, తెలుగు) కట్టుకున్న ముద్దుల మొగుడూ ఫార్సులగుండా ప్రయాణం చేస్తున్న కథ, ఈ ఉత్తరాల తారుమారుతో పాకాన పడుతుంది. గూబని గులాబ్ జామ్ చేసే తన యజమాని, డ్రిల్లు మాస్టరు స్వాతి వెంటపడుతున్నాడని సన్నాసికి లీలగా తెలుసు. లెటర్ బాంబు పుచ్చుకు కీర్తి తిన్నగా స్వాతి యింటికి వెళ్తుంది. ప్రథమకోపం చల్లారాక, రాజాని ఒక దారిలో పెడతానంటుంది స్వాతి. వారిద్దరూ కాలేజీ ఫ్రెండ్స్ - ఒకే ప్రాణంలా బతికిన ఛమ్స్. స్టూడెంటెవరో ప్రేమలేఖ రాస్తే, మా యిద్దరినీ కలిపి చేసుకుంటావా ? - అని అడిగిన అల్లరి సజ్జు. తనతో ప్రేమాయణం సాగిస్తున్న వ్యక్తి 'ఎలిజబుల్ యంగ్ మాన్' అనుకొన్నదే తప్ప, తన బెస్ట్ ఫ్రెండ్ భర్త అని తెలీదు స్వాతికి. ఇరువురు కలిసి ఆడిన నాటకంలో రాజా చిత్తుగా ఓడిపోతాడు. అయితే ఆ ఓటమిని వెన్నెలగా మారుస్తుంది కీర్తి. చట్టం కంటె సాంఘిక వాస్తవికత ముఖ్యం. హాస్యరస వల్లరితో ప్రేక్షకులని ఆనందింపజేసే ఈ చిత్రానికి దర్శకులు: రేలంగి నరసింహారావు. నిర్మాణ నిర్వహణ; వడ్డే రమేష్.

*Travelogue*

# Another Week in West Bengal

One evening as we returned from the Music Academy attending a concert, Saradamba told me, "Ten minutes back Sivsawmy Garu telephoned from Calcutta and he wants you to contact him immediately. It seems Malati got an award for her novel, 'Hrudaya Netri"

A fortnight back Dr. Bala showri Reddy was here at Madras and he rang me up from somewhere expressing his inability to call on us, as he was taking the evening flight to Calcutta. He said he had come to Madras for some medical consultation to Mrs. Reddy (Subhadra). The family has been known to us since three decades. During the telephonic conversation Dr. Reddy mentioned that he had read 'Hrudaya Netri' and found it quite interesting. At that stage, never for a moment could I think that Malati's novel which appeared as a serial in VANITA Telugu Monthly and subsequently brought out by Sailaja Publications would achieve distinction at national level to receive the prestigious Bharatiya Bhasha Parishad Award.

Anyway 1992 appears to have started with good augury. On the very first day of the New Year, I had to go to Visakhapatnam for the Bharat Cultural Integration Committee's Dance and Music Festival for National Integration. And on January 17, we left for Calcutta at the invitation of our bosom friends Radha and Sivaswamy and we had the unique opportunity of visiting Santi Niketan, Sundervans etc. On February 18 we were at Tirupati as Malati Chendur was to be conferred with an Honorary Doctorate of Letters by Sri Padmavati Mahila University, the fourth person to receive that honour, the first three being M. S. Subbalakshmi, Lakshmi Raghuramiah and Vasireddi Seeta Devi. On March 8, we were at Sreeharikota, the occasion being the International Women's Day - Malati Chendur addressing a gathering along with the

popular Tamil writer, Ms. Anuradha Ramanan.

To Calcutta again, in less then nine weeks we may have to go. Brooding over pleasant thoughts, I dialled and luckily I could get Sivaswamy who said : "Just now I received the good news and immediately I phoned up. This time Saradamba Garu also should accompany both of you. The award amount is eleven thousand and three first class fares." As I handed over the receiver to Malati, she was showered with most affectionate good wishes from the other end, both by Radha and Sivaswamy. Later we spoke to Balsshowri Reddy who informed us that we should be ready for the journey to Calcutta in the last week of March, the award function being fixed for 28th and 29th of March.

Now I must tell you what this Bharatiya Bhasha Parishad is all about. Funded in 1980, its sole aim is to promote Indian Literature and Culture with an intergrated approach. Indian Literature is in different languages, as we know, but it is essentially one and its oneness is emphasised by upholding certain fundamental values that are near and dear to us from times immemorial. In Hindi and Bengali since the inception of the Parishad, in Rajastani since 1984, in Punjabi since 1983, in Assamese since 1986, in Sanskrit since 1987, the Parishad has been giving awards for the outstanding creative writing in that particular language. Kannada, Tamil, Telugu, Malayalam, Gujarathi, Marathi and Oriya, come under the eategory of 'Other Languages.' As far as Telugu is concerned the first recipient was Dr. C. Narayana Reddy for 'Viswambhara' (1982), the second to Dr Puttaparti Narayancharyular for 'Srinivasa Prabandham' (1986) and now the third one to Dr. Malati Chendur for 'Hrudaya Netri' (1990). In the category of 'Other Languages,' the award is being offered once in every four years and this year the choice fell to Telugu language.

Of the lady-writers from South India, Smt. Rajam Krishnan bagged the award (Tamil - 1985), followed by Smt. Sivasankari (Tamil - 1989) and Smt. Malati Chendur happens to be the third in the list. She is the third recipient in the Telugu language as well

as the third one to attain this distinction amongst South Indian lady-writers. The award carries a cash prize of Rs. 11,000/- along with a memeto and a shawl.

We left for Calcutta by the Howrah Mail of March 25, and the clerk at the ticket counter of Madras Central was nice enough to mark 'coupe' for us in the requisition slip. We particularly waned a coupe, as we were carrying a wooden figurine of Lord Venkateswara and that art - piece should reach the destination in tact. It was about four feet in height. We got it wrapped in cloth, fortified by nylon strings. It was only for the safe transit of this figure that we wanted a coupe. We were happy on seeing the Reservation Chart as the desired coupe was allotted to us and we felt grateful to the clerk who was so considerate to mark our slip with the word 'coupe'. She said we would get it, unless a VIP stood in the way. Fortunately for us no such mishap occurred.

With coffee at Vijayawada, breakfast at Nidadovole and sweets packet from Gangadharam and Bala at Rajahmundry, the journey was smooth. At Visakhapatnam, Prasuna with lunch carrier and Chitti and Shooba with filtered water bottles and sandwiches and chapautties for the night. With the attendant looking after our requirements if any, the travel was quite comfortable, though during daytime it was hot and sultry. After Berhampur the weather was pleasant and as we woke up, we were fast approaching the suburbs of Calcutta. Sundara Lakshmi who joined us at Visakhapatnam was in another bogie. As we got down on the Howrah Platform, Driver Khan was there to greet us (he was one of the two drivers during our earlier trip in January 1992) and with Sundari joining us, we came to the parking spot, where Driver Sukumar welcomed us with folded hands.

"Why two cars? One is enough for us," I said.

"Madam wanted both of us to go. If one fails, the other can spot the guests," said Sukumar.

We know Radha - she is extra careful in matters of this nature. Last time the driver failed to spot us. So, this time, one on to the platform and the other at the exit - gate. The bond between our two families is so deep-rooted that words fail to convey its freshness and fragrance.

To Sundari, it was somewhat new, while to us it was all quite familier - the faces, the atmosphere, the roads and Nizam Place Quarters where the Sivaswamys were staying. We spent about ten days and shared several joys of adventure barely nine weeks back. Up we went to the third floor by lift and at the door was our charming hostess and unassuming, affectionate Sivaswamy.

"Nobody takes you as the Chief Commissioner of Income-tax and nobody takes me as Malati Chendur," says Malati to Sivaswamy quite often. An element of truth in her observation cannot be dismissed entirely.

Sipping hot coffee, we plunged into an endless world of conversation. where you pour out your thoughts and feelings without any hindrance. Men and Matters, Events and Episodes appear as fleeting white clouds on mental horizon. You listen and talk and talk and listen, a constant exchange of ideas between like-minded people.

"It is time for lunch" warned Radha and we dispersed to our rooms. *(to be continued*

**—NR. CHENDUR**

# కొత్త పుస్తకాలు

భాగవత కథా సుధ - మొదటి భాగం. రచన : పప్పు వేణుగోపాల రావు. ప్రచురణ : భాగవత తత్త్వ ప్రచార సమితి, కడప.... వెల : రు. 9-00.

'భాగవతంలోని పద్యాలో, పద్య పాదాలో నోటికి ఒకటి రెండైనా రాని వాడు తెలుగువాడు కాడు - అంతటి కమనీయ రచనా శిల్పం పోతనది' - అంటారు రచయిత పప్పు వేణుగోపాల రావు. ఇది అక్షర లక్షల కాలం కాక పోయినా అవి నిజంగా సువర్ణాక్ష రాలు. 'ఎవ్వనిచే జనించు'.... పద్యం రాని మనిషి, తన భాష తెలుగు అని చెప్పుకోవటం సిగ్గుచేటు.

అరణ్యాలలో కెల్లా ఎక్కువ పుణ్య మిచ్చేదీ, మునులతో నిండినదీ, ఫల పుష్పాదులు సమృద్ధిగా వున్నదీ నైమిశారణ్యం. రోమహర్షణుని కుమా రుడు ఉగ్రశ్రవుని, అంటే సూతుని, శౌనకాది మహామునులు, నారాయణుని కథ చెప్పమంటారు. వేదోపనిషత్తులు, ధర్మశాస్త్రాలూ కంటె, సూటిగా హృద యానికి హత్తుకు, భక్తి మార్గం వైపుగా మనసుని తిప్పగల, కృష్ణని గురించి, కృష్ణ లీలల గురించి చెప్ప మంటారు - అదే భాగవత పురాణం.

విష్ణువు దశావతారాల మాట అటుంచి, భాగవత కథనం ప్రకారం భగవంతునివి ఇరవైఒక్క అవతా రాలు. సనత్కుమారునితో ప్రారంభ మై బుద్ధుడు లేక కల్కి అవతారంతో ముగుస్తుంది. నారదుడు, పృథువు, మోహిని, వ్యాసుడు కూడా ఈ ఇరవై ఒకరిలో ఉన్నారు. వ్యాసుడు భాగవత రచన చేసి, తన కుమారుడైన శుకుని చేత చదివిస్తాడు ; ఈ శుకుడు పరీక్షి త్తుకి చెబుతాడు. నాలుగు వేదాల సారాన్ని పంచమ వేదమైన మహా భారతంలో చెప్పినప్పటికీ తృప్తికల గని వ్యాసుడు, నారదుని ప్రోత్సాహం తో, హరినామ స్మరణలోని అనిర్వచ నీయానందానుభూతి చెబుతాడు. 'హరి యను రెండక్షరములు హరియించును పాతకములు అంబుజనాభా....'

ప్రథమ స్కంథంలో శ్రీకృష్ణుడు భారత యుద్ధానంతరం ద్వారకకు వెళ్లడం, ఉత్తరకు పరీక్షిత్తు జన్మించ టం, గాంధారీ ధృతరాష్ట్రుల దేహ త్యాగం, శ్రీకృష్ణ నిర్యాణం, కలిని పరీక్షిత్తు అదుపులో పెట్టడం, శమీకుని కుమారుడు శృంగి యిచ్చిన శాపం, శుకుడు పరీక్షిత్తు వద్దకు రావటం ఉంటాయి.

ఇక, ద్వితీయ స్కంధంలో పరీక్షిత్తు భక్తిమార్గం తెలుసుకోవడం, నారదునికి బ్రహ్మ, తను ఊర్ధ్వ లోకాలు ఏడూ అధో లోకాలు ఏడూ ఏ విధంగా ఏర్పరిచి సప్తధాతువులతో ప్రాణిని ఎలా సృష్టించినదీ చెప్పడం. భక్తజన పారిజాతమైన శ్రీహరి,.... సృష్టి స్థితి లయములు పరమాత్మకు 'ఆశ్రయం' అయితే, ఆధ్యాత్మిక, అధి దైవిక, అధి భౌతికములు జీవాత్మ లక్షణాలు కావడం, పురుషోత్తమని యోగనిద్ర - వీటితో ద్వితీయ స్కంధం ముగుస్తుంది.

భాగవత సారాన్ని, అందులోని కథా విశేషాలని నేటి పాఠకులు మెచ్చేటట్లు చెప్పారు పప్పు వేణుగోపాలరావు.

—క్షీరసాగరమ్

THE DREAM OF A POETESS and other Poems by Late Dr. B. Ramakrishna Rao. Published by B. Ranganath Rao, 3-4-139 Barkatpura, Hyderabad 500 027. Price : Rs. 5-00. (ఇంగ్లీషు పుస్తకం)

'నాన్నగారి పాతకాగితాలు వెతుకుతూండగా ఈ చిత్తు ప్రతి కనిపించింది. పూనె ఫెర్గుసన్ కాలేజీలో (1919 - 1920) చదువుతున్న రోజులలో వ్రాసినవై ఉండవచ్చు. ఇరవై యిరవైరెండేళ్ల ప్రాయంలో ఆనాటి విక్టోరియన్ భావాల ప్రతిరూపం కావచ్చు' - అన్నారు రంగనాథరావు ఈ కవితలని పరిచయం చేస్తూ.

'స్వాతంత్ర్య యోధునిగా, దేశభక్తునిగా, తెలుగు వారందరూ ఒక రాష్ట్ర ప్రజలై ప్రగతి మార్గాన పయనించాలనే సంకల్ప బీజానికిగా మన జాతి చరిత్రలో బూర్గుల వారి స్థానం ఎంతో ఘనమైనది. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ, పర్షియన్, అరబిక్, మరాఠీ భాషలు ఆయనకు తెలుసు. సంస్కృతంలో బాగా ప్రవేశం వుండటంవల్లనే, కనకధారా స్తవము, సౌందర్య లహరి తెలుగు చేశారు. మానసికానందం కోసం ఆయన రాసుకున్న పొయిట్రీలో భావుకత, మార్మికత వున్నాయి' - అన్నారు 'ముందు మాట'గా అడపా రామకృష్ణారావు.

కళ్లు తెరిచే కలగంటున్నాను - చర్మ చక్షువుకి తెలియనిది మనోనేత్రం వీక్షిస్తోంది - తేనేలొలికే ఆ పిల్లన గ్రోవి ముప్పొద్దులా వింటున్నా, తనివి తీరదే అనుకుంటుందట రాధ - విశ్వ ప్రభువు దోబూచు లాటలోఅడవిపక్షుల అనురాగ శృతి, మలయ పవనపు మంద్ర స్వరం - గండ శిలలు గుండె గానానికి ద్రవించిపోగా, మంచుబొట్లు తామరాకుకి అందమిస్తాయి - క్రూరమైన గాలి సుగంధాన్ని మోసుకొచ్చే దూత - దేహ, ఈ కాయమూ మనసూ నీవైనప్పుడు, నేను సమర్పించుకోగల దేమున్నది ? డెబ్బయ్యేళ్ల క్రితం ఒక కవితా హృదయం ఆలపించిన రాగమాలిక.

—సుమతీ సాగర్

సైన్స్ ఫిక్షన్

# జూలియస్

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : డాక్టర్ మల్హొత్రా 'కాజిల్ లోలిటా'కు మిత్రులు రాజేష్, షార్మాలు వచ్చారు నూతన సంవత్సర వేడుక సందర్భంగా, మిత్రత్రయం ప్రతి న్యూయియర్‌కి విధిగా కలుసుకుంటారు. ఈ సంవత్సరం మల్హొత్రా మేనకోడలు సునీత కూడా ఉంది. ఆగంతుకునిలా వచ్చి అతిథ్యం పొందుతున్నాడు జూలియస్.... ఇక చదివండి

"అంకుల్, మీరంతా... ఇయర్ ఎండింగ్ అని నన్ను ఆట పట్టిస్తున్నారు కదూ!..." చివ్వున పైకిలేచింది ... "ఊఁ... అట్లానే నేనూ వూరుకొంటున్నాను... అఁ... లేక పోతేనా" తర్జనితో బెదిరించింది.

"ఏ వయసుకా ముచ్చట బేబి..." నెమ్మదిగా పలికాడు మల్హొత్రా

చిన్నముల్లును అందుకొని ఓడించి ముందుకు సాగాలని... పరుగులెట్టి వస్తోంది... పెద్దముల్లు... చిన్నముల్లు పన్నెండు దగ్గరగా జరిగింది.

అనాహూతుడిలా పొగమంచు తెరలు తెరలుగా తెరచి వుంచిన గుమ్మం గుండా లోనికి అడుగు పెట్టి గదిని నింపి సువాసనలను పంచి పెట్టింది.

మంచు వెనుక... మనిషి ఆకారం... మసక మసకగా వుంది.

"ఎవరది!" - గర్జించాడు డాక్టర్ మల్హొత్రా.

'డాక్టరు కోసం వెదుక్కుంటూ అర్ధరాత్రిలో ఇంకెవరొస్తారు... మూడ్ పాడు పాడు చేసేట్టున్నాడు" విసుక్కున్నాడు రాజేష్.

అవతలి వ్యక్తి బదులేమీ చెప్పలేదు.

'కౌన్ హై... క్యా ఛాహియేతుమే?'

"....."

"హు ఈజ్ దట్?" కాస్త గట్టిగా మల్హొత్రా. అందరి కళ్లూ ఆగంతుకుని వైపే తిరిగాయి.

'ఐ యామ్... ఎ ట్రావెలర్... పొలైట్‌గా బదులిచ్చి, 'మే... ఐ కమిన్, సార్'

లేచి ఎదురేగి.... "మోస్ట్ వెల్‌కమ్ మై డియర్ సర్.... ప్లీజ్ కమిన్".... అన్నాడు ప్రసన్న వదనంతో డాక్టర్ మల్హొత్రా.

"థాంక్యూ, వెరీమచ్, సర్...." అంటూ చికిలించి హాలంతా కలియ చూచాడు ఆగంతకుడు.

"దిస్ ఈజ్ డాక్టర్ షార్మా.... వెట్ డాక్ ఫ్రం గుజరాత్ దిస్ ఈజ్ మిస్టర్ రాజేష్ బిజినెస్ మాగ్నేట్ ఫ్రం ఆంధ్రా అండ్ దిస్ ఈజ్ మిస్ సునీతా.... మై నీస్" అంటూ పేరు పేరునా పరిచయం చేశాడు.

"గ్లాడ్ టు మీట్యూ సర్స్" - తల వంచి మర్యాద పూర్వకంగా అభి వాదం చేశాడు ఆగంతకుడు.

"బైదబై.... ఐ యామ్ డాక్టర్ మాల్హోత్రా.... లోకల్ ఫిజిషియన్ అండ్ సర్జన్" అంటూ స్వపరిచయం చేసుకున్నాడు.

"ఐ థాట్ సో సర్" - కళ్లు చికి లించి గమ్మత్తుగా నవ్వాడు.

"ఐ యామ్ జూలియస్.... టూరిస్ట్ .... అండ్ ఐ లాస్ట్ మై.... వే".... అంటూ తన గురించి చెప్పుకున్నాడు.

అచ్చరలు అందానికి మారుపేరు అంటారు. ప్రబంధనాయికల్ని అచ్చర అందాలను తలదన్నే అందాలతో వర్ణిస్తారు కవులు....

పూవింటి దొర ఎలా వుంటాడో.... ఊహించడమే! విలక్షణ అందంతో జూలియస్ ప్రతి ఒక్కరినీ ఆకట్టు కున్నాడు.... ముఖ్యంగా సునీతను....

దేహచ్ఛాయ గులాబి కలిసిన దంతం వన్నెలో నిగారిస్తోంది.... బ్రహ్మదేవుడు ఏమరుపాటున ఓ అందాల భామను అబ్బాయిలా రూపు దిద్దాడా అన్న భ్రాంతి కలుగుతోంది...

"వోంట్యూ సిడౌన్ మిస్టర్ జూలి యస్.... సోఫా చూపిస్తూ.... మరి కొద్ది నిమిషాల్లో క్రొత్త సంవత్సరం లో అడుగిడబోయె ఈ శుభ సంద ర్భంలో.... మీ రాక మాకు చాలా సంతోష దాయకం....' అన్నాడు డాక్టర్ మల్హోత్రా....

(జూలియస్ తోడి సంభాషణ ఆంగ్లంలో అని గమనిక)

"దట్స్ వెరీ నైస్ ఆఫ్ యూ డాక్" సింగిల్ సోఫాలో రిలాక్సింగ్‌గా కూర్చున్నాడు జూలియస్.

రెండు చేతులూ రెండు సోఫా హాండిల్స్ మీద వేసి కాలు మీద కాలు వేసుకొని వెనక్కు జేరగలబడి కూర్చున్నాడు. తొడుక్కున్న సూట్ మెటరియల్ ఏదో తెలియడం లేదు. కానీ క్రీమ్ కలర్‌లో పాముకుబుసంలా వుంది. బూట్లూ ఇంచుమించు అదే రంగులో వున్నాయి. సర్వ సాధారణ క్రాప్.... వెంట్రుకలు నిండు బ్రౌన్ రంగులో వున్నాయి. కనుబొమలు.... కనురెప్పలు అదే రంగులో వున్నాయి. కంటి పాపలు బ్లూ రంగులో నీలాల్లా మిలమిల లాడుతున్నాయి. అంత రాత్రిలో కూడా నీట్‌గా షేవ్ చేసిన గడ్డం.... లైటు కాంతిని రిఫ్లెక్ట్ చేస్తోంది.... పొడవైన చేతి వేళ్లు, ఆరోగ్యవంతమైన గోళ్లు....

డాక్టర్ మల్హోత్రా ఇంట అతిథు లకూ అభ్యాగతులకు కొదువలేదు.... చెప్పాపెట్టకుండా రావడం. నాలుగు రోజులుండి వెళ్ళడం.... మామూలే... డాక్టర్ మల్హోత్రా.... కేవలం డాక్టరే కాదు, మంచి మాటకారి.... స్నేహశీలి. ఆయన చుట్టూ ఎప్పుడూ.... స్నేహి

తులు, ఆశ్రితులు.... మామూలే.... సునీతకు.... మేనమామ అలవాట్లు అభిరుచులు క్షుణ్ణంగా తెలియడంతో, ఎంత రాత్రిలో గెస్టులు వచ్చినా వారిని జాగ్రత్తగా పలకరించడం అల వాటైపోయింది.

జూలియస్ లాటి అపురూపమైన వ్యక్తిని.... చూస్తోందీ అర్ధరాత్రి. అతిథి వయసు సుమారు ఎంత వుం టుందో! అంచనా వేయడానికి విఫల ప్రయత్నం చేయసాగింది సునీత.

'బేబీ.... హాట్‌గా.... స్పెషల్ కాఫీ'.... మేనమామ నోటినుండీ మాట వెలువడ్డం ఆలస్యంగా లోని కెళ్ళి వెంటనే తిరిగొచ్చింది సునీత.

సాయంత్రం నుండీ బట్లర్.... యజమాని ఏది కోరితే అది విసుగూ విరామం లేకుండా అందిస్తూనే వున్నాడు. ఛోక్రా నందు ఖాళీప్లేట్లు, క్రోకరీ తీసేస్తూనే వున్నాడు.

ట్రాలీలో కాఫీ పాట్, స్నాక్స్.... తెచ్చి అందరికి అందుబాటులో వుం డేట్టు ట్రాలీ మధ్యగా వుంచి లోనికి తప్పుకున్నాడు బట్లర్.

పొగలు సెగలు కక్కే కాఫీ కప్పుల్లో పోస్తూ.... ఆగంతకుని వైపు ప్రశ్నార్థకంగా చూచింది సునీత.

షుగర్ క్యూబ్స్ కప్పుల్లో వేయబో తుంది.... "సింగల్ క్యూబ్... నో .... మిల్క్ ప్లీజ్!" అన్నాడు చిరు నవ్వుతో... అలా నవ్వినపుడు తళుక్కుమన్న పలువరస అమరికకు, ఆ తెల్లదనానికి అచ్చెరు వొందింది సునీత.... ఏ కంపెనీ టూత్ పేస్టు మోడలో? - అనుకుంది మనసులో. తలా ఒక కప్పు కాఫీ అందించి, తనూ ఒక కప్పు కలుపుకుంది....

"బేబీ.... కొద్ది నిమిషాల్లో.... ఈ సంవత్సరం వెనకబడి పోతుంది... క్రొత్త సంవత్సరానికి నాందీగా నీ కమ్మని సంగీతంతో ఆహ్వాన గీతిక ఆలపించాలి తల్లీ" - కుడిచేయి తల మీద వేసి నిమిరాడు మల్హోత్రా.

గతంలో.. ఫ్రెండ్స్ ముగ్గురే కాలక్షేపం చేసేవారు. ఈ సారి.... సునీత కాకుండా,.... ఆగంతకుడు మిస్టర్ జూలియస్ కూడా వుండడంతో ... మరి కాస్త హుషారన్పించింది.

'ఓకే... అంకుల్.... మీ ఇష్టం' .... అంటూ.... కాఫీ గబగబా గొం తులో పోసుకొని, హాల్లో... ఓ ప్రక్క గా వున్న పియానో కేసి నడిచింది.

ఆ పియానో ఎప్పుడూ అక్కడ చూడ్డమే కానీ దాన్ని ఎవరు వాయి స్తుంటారో తెలియని రాజేష్, డాక్టర్ షార్మాలు సంగీత కారిణి ఎవరో తెలుసుకున్నాక సర్దుక్కూర్చున్నారు.

పియానో దగ్గరగా స్టూల్ లాక్కొని.... ప్రక్కనే బల్ల సొరుగు లోంచి సంగీత రచనమ తీసి.... ఎదురుగా క్లిప్‌కు తగిలించింది.

చేతివ్రేళ్ళు అలవోకగా రీడ్స్ మీద కదిలించింది. పియానో పర్ఫెక్ట్ ట్యూ నింగ్‌లో వుందనడానికి నిదర్శనంగా ఖంగున మోగాయి రీడ్స్.

ఆదమరచి వున్నవేళ, వెన్నుమీద సుతారంగా రాస్తూ చక్కలిగింత పెట్టి నట్టి అనుభూతి కల్గింది శ్రోతల్లో.

బెథావెన్.... బాక్.... మొదలైన వారి సంగీత రచనను మొదట వాయించి.... న్యూయియర్‌కు పాడుకో దగిన గీతాలు కొన్ని.... ఒకదాని వెనుక ఒకటి.... వాయించడంలో లీనమైంది.... సునీత.... పియానో నుండీ వెలువడిన శబ్దతరంగాలు అలలు అలలుగా హాలంతా ఆక్రమించాయి.... మరి కాస్సేపటికి.... ఆ నిండిన హాలు నుండీ వెలికి వచ్చి ఆ చుట్టుపట్ల నిండిన నిశ్శబ్ద నీరవంలో చైతన్యాన్ని కల్గించింది.

ఆ అమ్మాయి.... స్టూలుమీద కూర్చున్న భంగిమ.... సంగీతంలో లీనమై.... వాయించే తీరులో.... ఆమె స్లిమ్ ఫిగర్.... లాలిత్యం ఉట్టిపడేలా అటూ ఇటూ ఉగుతూంటే, మైమరచి కూర్చుండి పోయారు.

లోపలి గుమ్మాల వద్ద.... కుక్, బట్లర్.... మాలి, సర్వెంట్స్.... అలా .... స్పెల్‌బౌండ్‌గా, నుంచుండి పోయారు....

జూలియస్ ముఖంలో.... అదోలాటి అనిర్వచనీయమైన.... భావన... బహుశా.... విదేశాల్లో.... వినే సంగీత బాణీలు ఇండియాలో అందునా మారుమూల కొండప్రాంతంలో వినడం ఆశ్చర్యం కల్గించినట్టుంది.

కూర్చున్న చోటు నుండీ.... లేచి వచ్చి సునీతకు దగ్గరగా నుంచుని "మిస్ సునీతా యూ ఆర్ వండ్రఫుల్ ..... థాంక్యూ సో మచ్ ఫర్ ద నైస్ మ్యూజిక్.... ఇట్స్ ఎ రేర్ ఆపర్చునిటీ ఫర్ మి.... ఐ రియల్లీ ఎంజాయ్‌డ్ ఇట్" అంటూ.... పియానోకు ఆనుకున్నాడు.

చేతులు ఒడిలో వుంచుకొని... ఓ మారు తలెత్తి చూచి... సిగ్గుగా తల వాల్చుకుంది సునీత.

"నిజంగా నాకు మ్యూజిక్ అంటే తెలియదు. కానీ... నేను... బాలా అదృష్టవంతుణ్ణి" - రీడ్స్ మీద చేయి ఆడించాడు...

ఆ యువ జంట... అలా... ఒకరికొకరు... సన్నిహితంగా... వుండడం చూస్తూంటె... ఆ దృశ్యం... ఎందుకో బాలా నచ్చినట్టనిపించింది మల్హోత్రాకు ... త్వరలోనే... మంచి... సంబంధాన్ని చూచి... సునీత నొక ఇంటి దాన్ని చేసేయాలని... అప్పుడు వాళ్ళిద్దరూ... ఈలా సన్నిహితంగా వుంటే, చూచి తరించాలన్న కోరిక ఎదలో బలపడింది.

పెద్దముల్లు చిన్నముల్లును కప్పేసింది... ఠంగు ఠంగున పన్నెండు కొట్టింది... ఆ నాదం హాలంతా మారు మ్రోగింది... అందరి గుండెల్లో పులకింతలు.

"ఫేర్‌వెల్ టు ద ఔట్ గోయింగ్ ఇయర్ అండ్ వెల్‌కమ్ టు ది హాపీ న్యూ యియర్" అని లేచి ఒక్కొక్కరినీ విష్ చేస్తూ... కరచాలనం చేస్తూ మిత్రులను హగ్ చేసుకున్నాడు డాక్టర్ మల్హోత్రా...

ఇన్‌టర్న్... డాక్టర్ మల్హోత్రాకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపారు మిత్రులు.

స్కూల్లో... నూతన సంవత్సరానికి నాందీ పలికే ఒక పాటను పియానో మీద వాయించింది సునీత...

క్రొత్తరకం స్వీట్స్, మిల్క్ షేకి వున్న ట్రాలీని మధ్య లో వుంచి వెళ్ళాడు బట్లర్.

సునీత, జూలియస్‌లు వచ్చి యథా స్థానాల్లో కూర్చున్నారు.

స్వహస్తాలతో అందరికీ స్వీట్స్ అందించాడు డాక్టర్ మల్హోత్రా.

ఒక స్వీట్‌ను మేనమామ నోటికి అందించింది సునీత...

"మిస్టర్ జూలియస్.... ఈ నూతన సంవత్సర ప్రవేశ శుభ సందర్భంలో ... మీరు.... మీ ఇంటికి దూరంగా వున్నందుకు బాధపడుతున్నారా...." అన్నాడు రాజేష్.

'నో ... మిస్టర్ ర్రా...జే...ష్...." ఓ మాదిరీ యాసతో వొత్తి పలుకుతూ ... నో డౌట్ దేరీజ్ నో ప్లేస్ లైక్ హోమ్ కానీ దిస్ ఈజ్ సమ్‌తింగ్ యునీక్ ఎక్స్‌పీరియన్స్ ఫర్ మి.... నిజం చెప్పాలంటె ఇంతటి ఆత్మీయత.... ఆప్యాయత కలిగిన మనుష్యుల మధ్య అందులోనూ అపురూపమైన అందగత్తె.... ఆతిధ్యంలో ఐ ఫీల్ క్వైట్'ఎట్ హూమ్... థ్యాంక్యూ థాంక్యూ సో మచ్" అన్నాడు...

అతని మాటల్లో దాచుకోలేని నిజాయితీ వెల్లడైంది... "వెల్ లేడీస్ అండ్ జెంటిల్‌మాన్... ఇప్పటికి సెలవు తీసుకుందాం.... మళ్ళీ ఉదయం నుండీ బిజీ ప్రోగ్రామ్ వుంటుంది..." అంటూ అందరి వంకా చూశాడు డాక్టర్ మల్హోత్రా...

"అమ్మ... బేబీ... మూడవ నెంబరు గదిలో మిస్టర్ జూలియస్‌కు ఏర్పాటు చేయి..."

"మిస్టర్ జూలియస్... అక్కడ వార్డ్ రోబ్‌లో మీకు కావాల్సిన చేంజ్ ఆఫ్ లినిన్ వుంటుంది. హావ్ ఎ నైస్ నైట్స్ రెస్ట్.. సీ యూ ఇన్ ద మాణింగ్... గుడ్‌నైట్ ఎవ్రీబడీ"... మల్హోత్రా... అన్నాడు.

"గుడ్‌నైట్ కాదోయ్ మిత్రమా గుడ్‌మాణింగ్ అనాలి" - సవరించాడు డాక్టర్ షార్మా.

నవ్వులతో హాలంతా దద్దరిల్లింది... మెట్లెక్కి.... ఎవరి గదికి వారెళ్లి తలుపు వేసుకున్నారు...

## 3

నిద్రలేచే వేళకు...

షాంపూచేసుకు ముడిగా ఆరిన జుటును... పొందికగా దువ్వి వదిలేసింది. లెమన్ ఎల్లో నిట్టెడ్ స్ట్రైప్ పేంటు, అదే రంగు స్లీవ్‌లెస్ స్వెటరు వేసుకొని... తగ్గ మేకప్‌తో... అప్పుడే వచ్చిన 'ఎల్లో అమరిల్'లాగ సువాసనలు వెదజల్లుతో హాల్లో రాత్రి అస్తవ్యస్తంగా పడున్న వస్తువులను పొందికగా అమర్చుతూ... వుండిపోయింది సునీత.

టు ఇన్ వన్ నుండీ బిస్మిల్లా ఖాన్ షహనాయ్ వాద్యం... మంద్రంగా విన్పడుతోంది.

బైట నుండీ డాక్టర్ మల్హోత్రాను చూడవచ్చే గెస్ట్‌ల రద్దీని, అతిధి మర్యాదలను.. ఎదుర్కోడానికి రనా యీలో అన్ని ఏర్పాట్లూ సరిగా వున్నాయో లేదో చూచుకోవడానికి లోనికి వెళ్ళింది.

ఆలోగా కుర్తా పైజమా స్వెట్టరు ధరించి రాజేష్... వైట్ పేంటు మీద అలివ్ గ్రీన్ పుల్ వోవర్ ధరించి షార్మా... కేవలం కుర్తా పైజమా ధరించి జూలియస్... తెల్ల షర్టు, స్నఫ్ కలర్ పేంటులో టక్ చేసి... మెడకు గళ్ల మఫ్లర్ చుట్టి డాక్టర్ మల్హోత్రా... క్రిందకు దిగివచ్చారు...

"గుడ్‌మాణింగ్ అండ్ గుడ్‌డే ఎవ్రీబడీ" - అందరినీ కలియ జూస్తూ విష్ చేశాడు మల్హోత్రా...

కాడలు రెమ్మలతో కత్తిరించిన రకరకాల గులాబీలు జాగ్రత్తగా పట్టుకొని... సింహ ద్వారం దాటి లోనికొస్తూ 'హల్లో ఎవ్రిబడీ' అంది సునీత.

రాత్రి సూటులో చూచిన ఆగంతకుడు జూలియస్ "గుడ్ మాణింగ్ ఎంగ్ లేడీ" అంటూ విష్ చేశాడు. అతనెందుకో... అందరిలా కాకుండా విలక్షణంగా వున్నాడనిపించింది... ఒక్క క్షణం... అతని కళ్లతో... కళ్లు కలిపింది... అయస్కాంతంలా... తోచాయి అతని చూపులు...

బ్రేక్‌ఫాస్ట్ చేస్తూండగానే... మాలి ...న్యూస్ పేపర్లు రెండు తెచ్చి... హాల్లో బల్ల మీదుంచేశాడు.

ఓ పేపరు చేతిలో వుంచుకొని హెడ్డింగ్స్ చూస్తూ ఓ దగ్గర ఆగిపోయింది...

బ్రేక్‌ఫాస్ట్ ముగించి కాఫీ కప్పు చేత్తో వుచ్చుకొని హాల్లోకి వస్తూ "ఏమిటమ్మా బేబీ... ఏదైన ఇంటరిస్టింగ్ న్యూసా..." అన్నాడు డాక్టర్ మాల్హోత్రా...

'పేపరు చేతికి అందుకోవాలిగాని ప్రతి హెడ్డింగూ స్పెషల్ !' అన్నాడు రాజేష్.

"ఎస్.... ఎక్కడా అన్యాయాలు... అక్రమాలు.... మానభంగాలు .... దోపిడీలు, హత్యలు.... ఒకరినొకరు దుయ్యబట్టుకోవడాలు... మానవ జాతి ఎటు పయనిస్తుందో కూడా తెలియడం లేదు.... స్వదేశీ వార్తలూ అంతే విదేశీ వార్తలూ అంతే".... మనసులోని ఆవేదనను మాటల్లో వెలిబుచ్చాడు కాంతి దేవ్ షార్మా.

"అంకుల్.... ఈ రోజు నిజంగా... చాలా మంచి వార్తవుంది, అంకుల్.... UFOను ఎవరో... పొలాల్లో పని చేసుకొని వాళ్లు చూశారట" -అంది సునీత.

"వ్యాట్ UFOను మన దేశంలో చూశారటనా ? ఈ పిచ్చి మనకూ పట్టుకుందన్న మాట !" - షార్మా తీసిపారేశాడు.

"ఏం.... మన దేశంలో వాళ్లకు కళ్లులేవా ?.... నిజంగానే చూశారేమో ....అందుకే చెప్పివుంటారు"-అన్నాడు మల్హోత్రా.

"అసలు.... UFO అని కొన్ని సంవత్సరాలుగా విదేశాల్లో అనడమే !

వాటి గురించిన రహస్యాలు ఛేదించ డానికి ప్రాజెక్టులు కూడా నెల కొల్పారు. మరి ఇంతవరకూ అవన్నీ కట్టుకథలుగానూ, ఫెయిరీ టేల్స్ గానూ మిగిలి పోయాయేగాని ప్రయో జనం శూన్యం....''-అన్నాడు షార్మా.

"మన వాళ్లు.... ఏ మిలిటరీ ప్లేన్‌నో, లేక మీటియరాలజికల్ బెలూన్స్‌ను చూచి భ్రమపడి వుంటార నడంలో సందేహం లేదు''.... తేల్చే శాడు రాజేష్.

"సరే.... అదలా వొదిలేయ్ అసలు UFOలు అనేవి నిజంగా వున్నాయా ? అనేది ప్రశ్న"- డాక్టర్ మల్హోత్రా కాఫీ కప్పు ప్రక్కన వుం చేస్తూ అన్నాడు.

"ఉండే వుంటాయి మామయ్యా.... మనిషి రాతి యుగం వాడు కాదు. రాకెట్ యుగాని కెగబాకిన వాడు. తన చుట్టూ ప్రపంచమే కాకుండా అంతరిక్షాన్ని శోధించాలన్న తపనే కాకుండా, సౌరకుటుంబంలోని గ్రహా లను వాటి వాటి భౌతిక గుణాలను, అందులో నివసించే ప్రాణకోటి వివరా లనూ తెలుసుకోవాలన్న ఆకాంక్షతో అంతరిక్ష నౌకలను, ఎక్స్‌ప్లోరర్లను ప్రయోగిస్తూనే వున్నాడు.

'చందమామ రావే, జాబిల్లి రావే' అని పాటపాడుతూ చల్లని చంద మామను చూపించి పసిపాపాయిని లాలించి నిద్రపుచ్చడమే తెలిసిన మన తల్లులకు సైతం... చంద్రుని మీద మానవుడు కాలూనడం, విజయ పతా కం ఎగరేయడం.... అక్కణ్ణుంచీ భూమ్మీదకు మాట్లాడ్డం... వాలద న్నట్టు చంద్రగ్రహం మీదనుండీ శిలలనూ మట్టిని తీసుకొని రావడం... తెలుసు.... ఇప్పుడేమో మిల్కీవేలో వున్న నక్షత్ర కూటాలలో జీవకోటి వున్నదా ?.... వుంటే ఆ బుద్ధి జీవులు మనకన్నా తెలివైన వారనీ.... వారిని వెదికి పట్టుకొని.... సంబంధ బాంధ వ్యాలు పెంపొందించుకోవాలని తమ విజ్ఞానాన్ని అంతా వినియోగిస్తున్నా రనీ తెలిసిందే కద మామయ్యా.... ఆస్ట్రోఫిజిసిస్ట్.... ఆస్ట్రోనమిస్ట్ ప్రతి రోజు ఓ క్రొత్త ఫార్ములాను కనిపెట్ట డం కాస్మోసియల్ కాన్‌స్టెంట్‌ను క్రమ బద్ధం చేసి... ధృవీకరించడంలో ఎంతో మంది మేధావులు.... కోపర్నికస్ కాలం నుండీ కూడా నేటి వరకూ తమ మేధను కాచి వడ బోస్తూనే వున్నారు !"

నిలకడ లేకుండా చెప్పుకుపోతున్న సునీత వైపే కళ్ళప్పగించి, నోరు వెళ్ళబెట్టి, వింటూండి పోయారు మిత్రులు ముగ్గురూ.

జూలియస్ మాత్రం చిరునవ్వులు చిందిస్తూ రెప్పవేయకుండా చూస్తూండి పోయాడు.

"మా చెల్లి చనిపోతే.... నిన్ను ఈ భుజం మీద జోకొట్టి నిద్రపుచ్చడమే తెలుసు... మీ అత్తయ్య కోప్పడితే నీ కంటిలో మెరిసే తడిని తుడవడమే నాకు తెలుసు. కానీ, అమ్మా నీవు.... అంత విజ్ఞానాన్ని ఎక్కడ సంపాదిం చావు.'' - ప్రక్కనే కూర్చొని వున్న

సునీత కభిముఖంగా తిరిగి దగ్గరగా పొదువుకొని శిరస్సును చుంబించాడు డాక్టర్ మల్హోత్రా.

"అదేమిటి మామయ్యా, ఇందులో .... నా గొప్పేమీ లేదు.... ఈ రోజుల్లో స్కూళ్లల్లో.... అటు లైబ్రరీలలో కాస్మోస్‌ను గురించి సౌరకుటుంబాన్ని గురించి విషయాలెన్నో ఎన్నో తెలుసుకోవచ్చు !"

"గొడ్ల మధ్య కూర్చొని అదే లోకంగా భావించి నా అమూల్య కాలాన్ని బాలామట్టుకు వృధా చేస్తున్నా నన్నమాట ! డామిట్.... ఈ దఫా ఊరెళ్ళితే సరాసరి లైబ్రరీకి వెళ్ళి మెంబర్‌షిప్ కార్డు తెచ్చుకోవాలి !" ఆవేశంగా పలికాడు డాక్టర్ షార్మా.

"షూర్ యు డాక్ !" - సమర్థించాడు రాజేష్.

"మిస్టర్ జూలియస్.... విన్నారుగా .... అసలు అంత రిక్షాల్లో పయనించి దిగి వచ్చిన వారు విదేశీయులు.... ఈ ఫ్లయింగ్ ఆబ్జక్ట్స అనేవి నిజంగా గ్రహాంతరవాసులు మనలాగే వెదుక్కుంటూ భూమ్మీదకు వచ్చినవా రై వుంటారంటారా ?" - మల్హోత్రా ప్రశ్నించాడు.

తల అదోలా విదల్చి.... భుజా లెగురేసి అన్నాడు ; "భూగ్రహ వాసులకు ఇతర గ్రహాలకు వెళ్ళాలన్న క్యూరియాసిటీ వున్నట్టే ఇతర గ్రహ వాసులకూ గ్రహాంతర వాసులకూ క్యూరి యాసిటీ వుండడంలో తప్పు లేదు కదా ?" - సునీత వైపు చూస్తూ. సునీత కూడా ఆ నీలి కళ్ళలోకి చూస్తుండిపోయింది. ఆ నీలి పాపలు .... కదలుతూండడం గమనించింది.

"అఫ్‌కోర్స్.... మనిషి సంకల్పానికి సైన్స్, టెక్నాలజీ.... రెండూ రథ సారధులై నిలుస్తాయి.... కాబట్టి మనిషి సాధించగలడు ...." అన్నాడు డాక్టర్ మల్హోత్రా.

"మనిషి సాధించినట్లే ఇతర గెలాక్సీ వాసులైన ఇంటెలిజెంట్ బీయింగ్స్ సాధిస్తూనే వుంటారనడంలో.... సందేహం లేదు !" - తాపీగా బదులిచ్చాడు జూలియస్.

"కాని.... మిస్టర్ జూలియస్.... సౌరకుటుంబాల్లో వున్న తొమ్మిది గ్రహాలలోకీ భూమి మీదే జీవకోటి వున్నట్టు ఇప్పటికి మనకు నిర్ధారణగా తెలిసిన విషయం ! ఇతర గ్రహాల మీద ఇంకా నిర్ధారించవలసి వుంది!"

"అందుకే... మానవులు... ఇంకా వైజ్ఞానికంగానూ టెక్నలాజికల్‌గానూ చాలా ఎదగవలసి వుంది, మిస్ సునీతా !"

"అంటే అంతరిక్ష గ్రహాల్లో ప్రాణికోటి వెదకడానికి భూమ్మీద జాప్యం జరుగుతోందనా ?"

"కాదు ! భూమ్మీద సైంటిస్టులు అనుకొంటున్నట్టు ప్లానెట్స్ అన్నింటిలోనూ కొన్నే ప్రాణికోటి జీవించడానికి అనువైనవి."

(ఇంకా వుంది

JAGATI, Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004